| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| మూల్య | మొల్లము | వెల, పందెము |
| మూలికా | మొక్క, మొలక | అంకురము |
| మూషా | మూస | లోహములు కరుగునది |
| మూషక, మూషిక | మూసకము | ఎలుక |
| మృగ | మెకము, మెగము | 4 కాళ్ల జంతువు |
| మృగమద | మెకపుటాము | కస్తూరి |
| మృగశిర, మృగశీర్ష | మిగసిర | ఒక నక్షత్రము |
| మృగస్వామి | మెకములసామి | సింహము |
| మృజ్ | మ్రగ్గు | మరణించు |
| మృత్తికా, మృత్తు | మట్టి, మిత్తిక | మన్ను |
| మృత్యు | మిత్తి | చావు |
| మృత్స్న, మృత్స్నా | మన్ను | మట్టి |
| మృదు | మెతువు, మెదుకు | మెతుకు, మెత్తన |
| మేంథి | మెంతి | ఒక సంభారము |
| మేంధ్ర | మేదరి | తడుకలల్లువాఁడు |
| మేక | మేఁక | మేషము |
| మేఘ | మొగులు | మబ్బు |
| మేచక | మసకన | గబ్బుచీఁకటి |
| మేదస్ | మెదడు, మేదు | మస్తిష్కము |
| మేలక | మేళగించు | శ్రుతులఁగలుపు |
| మేష | మేఁక | అజము |
| మేషరాశి | మేఁకరాసి | 12 రాసులలో మొదటిది |
| మేళ | మేడము | కూడిక |
| | మేడి | నాఁగటికిఁ జేతికిఁగల్గునది |
| | మేళగించు | శ్రుతులగలుపు |
| | మేళము | నటులగుంపు |
| మోక్ష | మొక్కము | ఒక చెట్టు |
| మోఘ | మొక్క | వ్యర్థము |
| మోచకా | ముచ్చె | పాపోసు |
| మోరట | మోరు | మజ్జిగ |
| మోష | మోసము | భంగము |
| మౌంజీ | ముంజి | దర్భమొలతాడు |
| మౌక్తిక | ముత్తియము | ముత్తెము |
| మౌర్ఖ్య | మోఱకము | మూర్ఖత్వము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| మ్లేచ్ఛ | మెంచె | తురక |

## య

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| యంత్ర | జంతరము | కీలుపనిముట్టు |
| | ఏంతము | నీరెత్తుసాధనము |
| | జెంత | దుష్టప్రాణిస్త్రీ |
| యంత్రపాలిత / యంత్రిక | జెంతిక | ఒకభక్ష్యము |
| యంత్రికి | జేడ్డిగము | పిడతకుమూడుగొట్టాలు పెట్టియున్నది |
| యక్ష | జక్కులు | ఒకదేవయోనులు |
| యక్షిణి | జక్కిని | నాగిని |
| యజ్ఞ | జన్నము | యాగము |
| యజ్ఞియ | జన్నె | దేవతార్పితము |
| యజ్ఞోపవీత | జందియము, జన్నిదము | జందెము |
| యత్న | జతన, జిత్తు | ప్రయత్నము |
| యమ | జముడు | ధర్మరాజు |
| యమధాటి | జంహాళి, జముదాడి | కటారి |
| యమళ | జమిలి, అమడ | రెట్టి |
| యమళికా | జమళిగ, జమలిక | ఒకవాద్యము |
| యమునా | జమున | ఒకనది |
| యవ | జవలు | ఒకధాన్యము |
| యవనికా | జవనిక | తెర |
| యవాగూ | జావ | నూకలగంజి |
| యశస్ | అసము | కీర్తి |
| యాత్ర | జాతర | గ్రామదేవతోత్సవము |
| యామ | జాము | 3 గంటలకాలము |
| యాయావర | అయివారము | భిక్షావృత్తి |
| యుక్త | ఒగితము | తగినది |
| | ఉత్తుడు | తగువాడు |
| యుక్తి | ఉత్తి, ఎత్తు, జిత్తు | పన్నగడ |
| యుగ | ఉగము | ఒకపరిమాణకాలము |
| యుగపత్ | ఉవెత్తు | ఒకసారిగానె |
| యువతి / యువని | జవరాలు / ఉవిద | స్త్రీ |
| యోగ | జోగము | ప్రాణాయామాదికము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| యోగపట్ట | యోగపట్టె, జోగపట్టియ | యోగులమెడపట్టెడ |
| యోగపాదుకా | యోగవాగములు | అంతరిక్షమునఁబోవు సిద్ధులపావకోళ్లు |
| యోగి | జోగి | యోగసాధనముచేసినవాఁడు |
| యోగిని | జోగిణి | యోగమెఱిఁగినస్త్రీ |
| యోధ | జోదు | యుద్ధభటుఁడు |
| యోషా<br>యోషి<br>యోషిత్ | జోటి<br>జోటిక | ఆఁడుది |
| యౌవన | జవ్వనము | ప్రాయము |

ర

| | | |
|---|---|---|
| రంకు | రంకు, ఱంకు | జారత్వము |
| రంగ | రంగఁడు<br>రంగు | రంగనాథుఁడు<br>వన్నె |
| రంధ్ర | క్రంత | చిల్లి |
| రక్త | రాగి | తామ్రము |
| రతి | రంతు | కేళి |
| రత్న | రతనము | మణి |
| రత్నఖని | రతనపుగని | మణులుదొరకుతావు |
| రథ | అరదము | తేరు |
| రథ్యా | రచ్చ | రాజమార్గము |
| రమణ | రాణ | ఒప్పు |
| రమ్య | రమణ, రవణము | ఒప్పు, భూషణము |
| రవ | రవడి | ధ్వని |
| రస | రసి | చీము |
| రసధారి | రసదాడి | ఒకచెఱకు,ఒకయరఁటి |
| రహాట | రాట్నము | నూలువడకుయంత్రము |
| రాక్షస | రక్కసుఁడు | దనుజుఁడు |
| రాక్షసి | రక్కసి, రాకాసి | దానవి |
| రాఘవ | రాగవుఁడు | రాముఁడు |
| రాజ | అరసు<br>రాచ<br>రాయఁడు, రావు | రాజు<br>క్షత్రియ<br>ప్రభువు |
| రాజకుల | రాచకొలము | క్షాత్రివంశము |
| రాజకూట | రచ్చకొట్టము | సభ |
| రాజభార | రాయబారము | సంధికర్మము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| రాజరాజ | రారాజు | ప్రభుప్రభువు |
| రాజస | రాయసము | రజోగుణము |
| రాజహంస | రాయంచ | మేటిహంస |
| రాజాన్న | రాజనాలు | ఒకవరి |
| రాజ్ఞి | రాణి | రాజభార్య |
| రాజ్ఞీవాస | రాణివాసము | అంతిపురము |
| రాట్ | రా, రేఁడు | రాజు |
| రాత్ర, రాత్రి | రాతిరి, రే, రేయి, రేతిరి | నిశి |
| రామబంధు | రాబందు | జటాయుజాతిపక్షి |
| రామా | రేమ | స్త్రీ |
| రాశి | రాసి | కుప్ప |
| రాష్ట్రి | రాటు | ఉపద్రవము |
| రాహుత్త | రావుత, రౌతు | సవార్ |
| రిక్త | రిచ్చ, రుత్త | వట్టి |
| రిక్తిక | రిత్తిక | మరదలు |
| రుక్మ | రూక | ధనము |
| రుత, రుతి | రొద | ధ్వని |
| రుద్రజటా | రుద్రజడ | ఒకమొక్క |
| రుద్రాక్ష | రుదురక్క, రుదురాక, రుదురాచ్చ | శివభక్తులతావళిపుఁబూస |
| రూఢ, రూఢి | రుటము, రూఢి | నిజము |
| రూప | రువ్వ | చెప్పినదేమరలఁజెప్పుట |
| | రూపు, ఉరవు | ఆకృతి |
| రూపణ | రూపించు | కనఁబఱచు |
| రూపశ | రూపరి | అందగాఁడు |
| రూప్య | రూపాయ | రూపాయి |
| రే | రే | ఓరీ |
| | రాత్రి | నిశి |
| రేఖా | రేక | గీటు |
| | లేక | జాబు |
| రై | రో | ధనము |
| | రోయి | పందెపుసొమ్ము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| రౌక్మ | రుంకము<br>రౌక్కము | రంధ్రము<br>ధనము |
| రోష | రోసము | కోపము |
| రోహిణి | రోయిని | ఒకనక్షత్రము |
| రౌంధ | రుంజె | ఒకవాద్యము |
| రౌరవ | రోరవము | ఒకపేరిటినరకము |

ల

| | | |
|---|---|---|
| లంక | లంకలు | బోడిసెనగలు |
| లంకా | లంక<br>కొంగ | దీవి<br>జారిణి |
| లంక, లంగ | లంకె | 2పసులఁగలిపికట్టుట |
| లంఘా | లంగ | గంతు |
| లంఘన | లంకణము<br>లాగు | రోగమందుపవాసము<br>ఆటమెలఁకువ |
| లంచ | లంచము | కార్యార్థమిచ్చినసొమ్ము |
| లంజా<br>లంజికా | లంజె, లంజ్య<br>లంజియ | వేశ్య |
| లంప | లంపటా | గాసీపుత్తురుఁడు |
| లంబట | లంబు | లావు |
| లంబన | లంబెన | మెడహారము |
| లక్ష్య | లెక్క | సంఖ్య, గణన |
| లక్షణ | లక్కణము, లచ్చనము | చిహ్నము |
| లక్ష్మణ<br>లక్షణ | లక్కుమనుఁడు<br>లచ్చనుఁడు | సౌమిత్రి |
| లక్ష్మి | లక్కిమి, లచ్చి | శ్రీదేవి |
| లగుడ | లాటీ, లోడీ<br>లౌణి, లవుడి | దుడ్డుకఱ్ఱ |
| లగ్న | లగనము, లగ్గము | శుభముహూర్తము |
| లఘు | లఘువు | చులుకన |
| లజ్జా | లజ్జ | సిగ్గు |
| లట్ట | లడ్డిగ | చిన్నమూతిపాత్ర |
| లట్వా, లడ్డుక | లడ్డు, లడ్వము | ఒకభక్ష్యము |
| లవ | రవ | రేణువు |
| లాంగల | నాఁగలి<br>లంగరు | దున్నుసాధనము<br>నాఁగలివంటిపాతు<br>కొనుపనిముట్టు |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| లాక్షా<br>రాక్షు, రక్షు | లక్క | జతువు |
| లాక్షాపేటి | లక్కపెట్టె | చిత్రపేటిక |
| లాఘవ | లగువు, లాగము | చులుకన |
| లాభ | లాబము | ఫలము |
| లావక | లావుక | ఒకపక్షి |
| లింగ | లింగడు | జంగమయ్య |
| లీన | లీన్యము | ఒద్దిక |
| లేఖ | లేక | జాబు |
| | రేక | వ్రాస |
| లేఖక | లేకరి | మునిషి |
| లేపన | లేపు | పూత |
| లేప్య | లప్పము, లెప్పము | గచ్చువంటిది |
| లేశ | లేసు | లవము |
| లోధ్రక | లొద్దుగు | ఒకచెట్టు |

## వ

| | | |
|---|---|---|
| వంక్రి | వంకిణము | కొంకికత్తి |
| | ఒంకె | విలుకకొయ్య |
| వంగ | బంగాళా | ఒకదేశము |
| | వంగ | ఒకమొక్క |
| వంచన | వంచన | మోసము |
| వంత | పొట్టి | ఏమనుడు |
| వంధ్యా | వంజె | గొడ్రాలు |
| వంశ | వంగడము | కులము |
| | వాసము | వెదురు |
| వంశి | వాసిగోవిలు, వాసి | పిల్లనగోవి |
| వక్ | వంగు | నమ్రమగు |
| వకుళ | పొగడ | ఒకచెట్టు |
| వక్ర | వంక | కుంచితము |
| | వంకి | కొంకికత్తి |
| | వక్కరము | కుటిలము |
| | వాంక | చక్రము |
| వక్రద్వార | వంకదారి | వంకరదారి |
| వచా | వజె, వస | ఒకమందుదినుసు |
| వజ్ర | వజ్జిరము | రవ |
| వట | వడము | మోకు |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| వటక | వడియము | వ్యంజనము |
| వటు | బటువు | వడుగుంగరము |
| | వడుఁగు | బ్రహ్మచారి |
| వటుక | వడుగఁడు | బ్రహ్మచారి |
| వఠర | వటారి | శూరుఁడు |
| వడవా | బడవా | కుంటెనకత్తె |
| వణిక్ | వాని | కోమటి |
| వత్సనాభి | వసనాభి | ఒకవిషవస్తువు |
| వద | వదరు | వదరుఁబోతు |
| వధూనీ, వధూనికా | వదినె | అన్నభార్య |
| వనితా | వెలఁది, వెలఁదుక | స్త్రీ |
| వపు | పంపు | మారణకర్మము |
| వరక | వరిగ | ఒకసస్యము |
| వరత్రా | వాఱు | తోలుచీలిక |
| వరాహ | వరహా | ఒకబంగరునాణెము |
| వర్ణ, వర్ణక | వన్నె | రంగు, కులము |
| వర్ణికా | వన్నియ | |
| వర్తన | వట్రము | కుఱుచ |
| వర్తి | వత్తి | దూదినలిచినది |
| వర్తుల | వట్రన | గుండ్రన |
| వర్ధకి | వడ్ల, వడ్రంగి | వడ్లబత్తుఁడు |
| వల్ | వలచు | మోహించు |
| వల | బలయు | పరివేష్టించు |
| వలక్ష | వెల్ల | తెల్ల |
| వల్క | వక్క | ఒత్తినపోఁక |
| వశ | వసము | శక్యము |
| వస్తి | బద్దె | గుడ్డచీలిక |
| వస్త్ర | పాఁత | చినిగినగుడ్డ |
| వళి | వడి | యతి |
| వాంఛ | వచ్చ | ఇచ్చ |
| వాంత | వాఁతి | డోఁకు |
| వాక్ | వాఁగు | శబ్దించు |
| | వా, వాయి | నోరు |
| | వాహిని | వాగ్ధోరణి |
| వాఁగా, వల్గ | వాగె | కళ్లెము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| వాగుజీ | బావంజి | ఒకచెట్టు |
| వాఛ్ | వాఁచు | ఉబ్బు |
| వాజ | వెస | త్వర |
| వాట, వాటీ | వాడ | వీధి |
| వాటచారి | బాటసారి | తెరువరి |
| వాటీవధూని | వాడవదినె | భోగముది |
| వాద, వాదన | వాదు | వాదము, వీణాదినాదము |
| వాద్య | వాద్దెము, వాజ్జము<br>వాయిదము | మృదంగాదివాద్యము |
| వాపీ | బావి | నూయి |
| బార | బారు | వరుస |
| వారణ | వార<br>వారఁడు | నివారణము<br>చాలింపఁడు |
| వార్తాక | వంకాయ, వంగ | వార్తాకము |
| వాల | వాలు | తోఁక, కత్తి |
| వాలమృగ | వాలుమెకము | అడవిపంది |
| వాస | బస | నివాసము |
| వాసస్<br>వాసన | వాసెన | ఎసటిపాత్రమూతికట్టుగుడ్డ |
| వాహ్యాళి | వయాళి | విహారము |
| వింధ్య | వింజెము | ఒకపర్వతము |
| వికట | వింగడము<br>వెగటు | వ్యత్యయము<br>అసహ్యము |
| వికల | వెకలి | వెంగలి |
| వికార | ఓకిలింత, వెక్కురు<br>వెక్కిరింత | అపహాస్యము |
| వికారి | బికాసి, వెకలి | వెంగలి |
| వికిర | బికిరము | తిరిపెము |
| విక్లబ | బెగ్గలము | భయము |
| విఘటికా | విగడియ | 24 సెకనులు |
| విజయ | వెచ్చెము | గెలుపు |
| విజ్ఞాన | విన్నననువు | నైపుణము, నేర్పు |
| విజ్ఞాని | విన్నాణి | నేర్పరి |
| విజ్ఞాపన | విన్నపము | మనవి |
| విట | విటకాఁడు | మిండఁడు |
| విటి | విటుకులాడి | లంకులాడి |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| విడంబ | వేడబము | వంచన |
| విడ్వర | విడ్డూరము | ఉపద్రవము |
| విద్యా | విద్దె | చదువు |
| | విడ్డెము | బాలక్రీడ |
| విధ | వితము | ప్రకారము |
| వినాయక | వెనకయ్య | గణపతి |
| విప్ర | పాఱుఁడు | బాపఁడు |
| విభూతి | విబూది | భస్మము |
| విరహ | విరాళి | స్త్రీపురుష వియోగతాపము |
| విరాగి | బైరాగి | సర్వపరిత్యాగి |
| విరాట | విరటుఁడు | ఒకప్రభువు |
| విలస్ | వెలయు | ప్రకాశించు |
| విలాస | వెళుకు | ఖులాస |
| విలీన | వెన్న | కఱఁగినేయియగునది |
| విలేపీ | వెలవ | కాపుడుగంజి |
| వివరణ | వివరము | వయినము |
| విశ్వాస | విసువాసము | నమ్మకము |
| విశ్వాసి | విసువాశి | నమ్మకముగలాఁడు |
| విష | విసము | గరళము |
| విషధారి | విసదారి | పాము |
| విషమ | బేసి | సరికానిది |
| విష్టి | వెట్టి | కూలియీకపనిఁగొనుట |
| విష్ణు | వెన్నుఁడు | శ్రీహరి |
| విసర్జ | వెచ్చము | ఖర్చు |
| విసృ | విసరు | త్రిప్పు |
| విస్మయ | విసుమానము | ఆశ్చర్యము |
| విహ్వల | బెగ్గలము, విలవిల | బాధవలనితపన |
| వీకాళ | వెక్కసము | దుస్సహము |
| | వెక్కసి | వెక్కసించువాఁడు |
| వీజ | వీచు | విసరు |
| వీటీ | వీడ్యము, వీడెము | తాంబూలము |
| వీటికా | విడియము, వీడియము | |
| వీణా | వీణె, వీనియ | ఒక జంత్రవాద్యము |
| వీధి | వీది | వాడ |
| వీర | వీరము | పరాక్రమము |
| వీరణ | వీరాణము | ఒక వాద్యము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| వీరమధ్య | వీరమద్దెలు | రాజుల జయచిహ్నపుఁగాలిసె |
| వీరముద్రికా | వీరముద్దెలు | స్త్రీలకాలివ్రేలి పిల్లాలు [ల్లాలు |
| వృషాదిని | బదనిక, బవనిక, వదనిక | ఒక మూలిక |
| వృత్ | వట్రిల్లు | తిరుగు |
| వృత్త | వట్రము | గుండ్రనిది |
| వృథ, వృథా | విత, వితా | నిరర్థకము |
| వృథావృథా | వితావిత | మిక్కిలి వ్యర్థము |
| వృద్ధ | వట్టము | నాణెములమీఁకపుఁ బెచ్చు |
| | పెడ, పెద్ద, బొద్దు | గొప్ప |
| వృద్ధతా, వృద్ధత్వ | పెద్దతనము, పెత్తనము | వార్ధక్యము |
| వృద్ధి | వడ్డి | అప్పునకుఁ బెరుగునది |
| | బ్రోది | అగావు |
| | ఉద్ది | పరిపూర్ణత్వము |
| వృద్ధివృద్ధి | వడ్డికివడ్డి | చక్రవడ్డి |
| వృష, వృషభ, ఋంగభ | బసవన్న | ఎద్దు, ఆఁబోతు |
| వృష్ణి | వ్రేఁడు | గొల్లవాఁడు |
| వేంకట | వెంకఁడు | ఒక పేరు |
| వేగ | వే, వేగిరము | త్వర |
| | వేగ | ఘురి |
| వేణి, ప్రవేణి | వేనలి | కొప్పు, జడ |
| వేత్రి | బెత్తము | పేముతీఁగ |
| వేద్య | విద్దెము | బాలక్రీడ |
| వేలా | వేడము | మండలాగ్రము |
| వేల్లంతరా | వెణుతురు, వెల్లుతురు | ఒకచెట్టు |
| వేష | బేసము, వేసము | పోషకు |
| వేష్టన | వేడెము | ఆక్రమించుకొనుట |
| | వేష్టువ | దోవతి |
| వేసర | వేసడము | కంచరగాడిదె |
| వైజ్ఞానిక | విన్నాణి | యోగి |
| వైణిక | వీణెకాఁడు | వీణెవాయించునతఁడు |
| వైద్య | వెజ్జు | మందిచ్చునతఁడు |
| వైర | వేరమి | శత్రుత్వము |
| వైశాఖ | వేసంగి | ఎండకారు, ఒకనెల |
| వైశ్య | వాసి, బచ్చు | కోమటి |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| వ్యంగ్య | వెంగలి | వికృతమయిన |
| వ్యజన | వీవన, విసనకఱ్ఱ | వ్యజనము |
| వ్యధా | వెత్త, వెతారము | వ్యసనము |
| వ్యయ | వెచ్చము | ఖర్చు |
| వ్యర్థ | వమ్ము, వాయము | నిష్ఫలము |
| వ్యవహార | బేరము, బేహారము, బేవరము | వ్యాపారము |
| వ్యవహారి | బేహారి, బేరి | వర్తకుఁడు |
| వ్యసన | వెసనము | క్లేశము |
| వ్యాఖ్యాన | వకృాణ, వైనము, ఒకృాణ | వివరణము |
| వ్యాఘ్రి | వాకుడు | ఒకచెట్టు |
| | వేగి | పులి |
| వ్యాఘ్రి | వాకుడు | ఒకచెట్టు |
| వ్యాపన | వేంబరించు | వ్యాపించు |
| వ్యావహారిక | బేహారికుఁడు | వర్తకుఁడు |
| వ్యాసటికా | వేసడము | కంచరగాడిదె |
| వ్యాడ | వాలము | పులి |
| వ్యాళ | వాలాము | పులి |
| వ్యూతి | నేఁత | నేయుపని |
| వ్రత | బత్తము | నోము |
| వ్రశ్చ | వ్రచ్చు | ఛేదించు |
| వ్రీడా | బిడియము | సిగ్గు |

## శ

| | | |
|---|---|---|
| శంకా | జంకు | భయము |
| శంఖ | చెంక, చెక్కిలి | చెంప |
| | సంకు | కంబువు |
| శంఖధారి | సంకుదారి | విష్ణువు |
| శంబల, సంబల | సంబడము | బత్తెము, జీతము |
| శంభళి | సంబరి | కుంటెనకత్తె |
| శకట | చెకడా, సగటు | పందెపుబండి |
| | సకలము | పందెపుబండి |
| శకల | చెక్క | పేడు |
| శకున | సగినము | అనాగతపుసూచన |
| శకునపక్షి | సకినంపుఁబక్కి | ఒకపిట్ట |
| శక్తి | సత్తి | సామర్థ్యము, కాళి |
| శఠ | చిట్లకట్టె | మూర్ఖుఁడు |
| శణ | జనము | ఒకనారచెట్టు |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| శతపుష్ప | సదాప | ఒకమందాకుచెట్టు |
| శని | సని | మందుఁడు |
| శబ్ద | సద్దు | ధ్వని |
| శమ | సమయు | నశించు |
| శమీ | జంబి,జమ్మి | ఒకచెట్టు |
| శమ్యా | సెమ్మె | దీపస్తంభము |
| శయ | చెయ్యి,చే | హస్తము |
| శయదీప | చేదివియ | కరదీపము |
| శయపేటీ | చేపెట్టె | మందసము |
| శయాంబక | చేయమ్ము | వింటిపనిలేనిబాణము |
| శయ్యా | సెజ్జ | పానుపు |
| శర | సరము,సరుడు | బాణము |
| శరండ | సరడు | మెడనగ |
| శరధారి | సరదారు | శూరుఁడు [యినవి |
| శరభ | సెరబము | పందెపుఁగుక్క పుంజు మొదల |
| శరావ | సావ | మూఁకుడు |
| శర్కరా | చెక్కెర | పంచదార |
| శల | సెల | పందిముల్లు |
| శలక | చెలగము | సాలీఁడు |
| శలాక | సలాక | సన్నయుక్కకమ్మి |
| శలాకా | సలుగు | ఏదుపంది |
| శల్క | చెక్కు | చీలిక |
| శల్య | సెల్లుఁడు | శల్యుఁడు |
| | చిల్ల,చీల; సీల,సెల | మేకు,బాణపుములికి |
| శల్యకాష్ఠ | సెలకట్టె | బాణము |
| శవ | సబము | పీనుఁగు |
| శష్కులి | చెక్కిలము | ఒకపిండివంట |
| శస్త | సిస్తు | కొనియాడఁదగిన |
| శాంఖిక | సంకులవాఁడు | జంగము |
| శాకద్వీప | సేకుదీవి | ఒకలంక |
| శాటక | చెట్ట,జేడక | చొక్కాయ,బొంత |
| శాణ,శాణి | సాన | కత్తులునూఱుటాయి |
| శాప | సాపించు,సెపియించు | తిట్టు |
| శార | చాఱ | రేఖ,జీడిమామిడి |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| శారి | సారె | సొగటాలకాయ |
| శారికా | సారియ | గోరవంక |
| శార్ఙ్గ | సింగిణి | సింగాణి |
| శాల | సాల | ఇల్లు |
| శాలిక | సాలె, సాలీఁడు | సాలెపురుగు |
| శాస్త్ర | చేట్టము | విధి |
| శింబలి | సంబెళ, సమ్మెట | పెద్దసుత్తె |
| శింబి | చెమ్మ | ఒకచెట్టు |
| శిక్య | చిక్కము | వలసంచి |
| శిఖ | సిగ | జుట్టుముడి |
| | సెగ, సేకము | వెట్ట |
| శిఖర | చివర | కొన |
| శిఖర | సికా | ముద్ర |
| శేఖర | సిగరము | శృంగము |
| శిఖరిణి | సిగరి | చల్లపులుసు |
| | సురిగి | ఒకచెట్టు |
| శిఖాఫల | సీకాయ | తలంటుచింతకాయ |
| శిథిలి | చెదలు | ఒకపురుగు |
| శిరస్ | సిరసు | తల |
| శిరీష | గిరిసెము, దిరిసెన | ఒకచెట్టు |
| శిరోనామ | చిఱునామ | జాబుపయిపేరు |
| శిలా | సెల | శిలానది, కొండకాల్వ |
| శిలాజతు | సిలాజిత్తు | ఒకమందుదినుసు |
| శివ | సివము | దేవతావేశము |
| శిశు, శిశుక | నిసుగు, సిసువు | పసిబిడ్డ |
| శిష్య | సిసువుఁడు | ఛాత్త్రుఁడు |
| శీ | చేయు | ఒనర్చు |
| శీత | సీతువు | చలికాలము |
| శీర్షక | సీసకము | శిరస్త్రము |
| శుంఠ | తుంట | తుంటరి |
| | సొంటు | అపరాధము |
| శుంఠి | సొంటి | ఎండినయల్లము |
| శుక | చిలుక | రామచిల్క |
| శుకరాహుత్త | చిలుకరౌతు | మన్మథుఁడు |
| శుక్ర | చుక్క, సుక్కురుఁడు | ఒకనక్షత్రము, గ్రహము |
| శుచి | చిచ్చు | నిప్పు |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| శుద్ధ | సుద్దము | శుభ్రము |
| శుద్ధి | సుద్ది | పరిశుద్ధి |
| శుల్క | సుంకు | ఓలి |
| | సుంకము | పన్ను |
| శుల్కహారి | సుంకరి | పన్నువసూలుచేయువాఁడు |
| శుల్బ | చెంబు | చేతిపాత్ర |
| శుష్క | చిరుక్కుట | సన్నగిలుట |
| | చొక్కాకు | ఎండినయాకు |
| శూన్య | సున్న | రిక్తము |
| శూర | సూఱకరి | వీరుఁడు |
| శూర్పణఖా | సుప్పనాతి, సుప్పనాక | రావణుచెల్లెలు |
| శూల | సూల | కడుపునొప్పిరోగము |
| శృంఖల, శృంఖలి, శృంఖలికా | సంకెల | ఇనుపగొలుసు |
| శృంగవాద | సింగినాదము | కొమ్మువాద్యము |
| శృంగార | చొకాటము, సింగారము | చక్కన |
| శృంగి | సింగి | చెంచుది |
| శృంగిణి | సింగాణి, సింగిణి | శృంగధనుస్సు |
| శేష | సేసలు | అక్షతలు |
| శోక | సోఁకురు | ఏడుపు |
| | సోకించు | ఏడుచు |
| శోధన | సోదన | పరిశీలన |
| శోఫ | సోపు | వాపు |
| | సోబె | పొడ |
| శోభన | సోబనము | కల్యాణము |
| | సోబాన | పెండ్లిపాట |
| శౌండ్య | సొడ్డు | తప్పు |
| శ్మశాన | మసనము | వల్లకాడు |
| శ్మశ్రు | మీసము | మూతిపై వెండ్రుకలు |
| శ్యామా | చాన, చామ | స్త్రీ |
| శ్యామక, శ్యామాక | చామలు | ఒకసస్యము |
| శ్యామ, శ్యామల | చామన | కొద్దినలుపు |
| శ్రద్ధ | జెడ్డ | కాంక్ష |
| | సడ్డ | లక్ష్యము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| శ్రమ | చెమట | స్వేదము |
| | సాము | పరిశ్రమ |
| | సరము | కష్టము |
| | సొమ్మ | మూర్ఛ |
| శ్రవ,శ్రవణ | చెవి | కర్ణము |
| శ్రాంతి | సేద | విశ్రాంతి |
| శ్రీ | సిరి,సీ,తిరు | లక్ష్మి,సంపద |
| శ్రీఖండ, శ్రీగంధ | సిరిగందము | మంచిగంధము |
| శ్రీఘట్ట | సిరిగట్ట | శ్రీశైలము |
| శ్రీధర | సీదరము | సర్పము |
| శ్రీభాసి | తివాసి | చిత్రాసనము |
| శ్రీమంత | సిరిమంతుఁడు | భాగ్యవంతుఁడు |
| శ్రీమతి | సీమాటి | భాగ్యశాలిని |
| శ్రీమృత్ | తిరుమణి | ధవళమృత్తిక |
| శ్రీరంగ | సిరంగము | ఒకదివ్యక్షేత్రము |
| | సిరంగఁడు | రంగనాయకులు |
| శ్రీరామ | సీరాముఁడు | రామమూర్తి |
| శ్రీరామసేన | సీరాముసేన | అసంఖ్యాకము |
| శ్రీవర | సిరివరుఁడు | విష్ణువు |
| శ్రుతి | సుతి | సంగీతమందలిమేళగింపు |
| | తిత్తి | ఊదఁబడుతోలుసంచి |
| | సుద్ది | వృత్తాంతము |
| శ్రుతికారి | సుతికాఁడు | తిత్తినూదువాఁడు |
| శ్రేష్ఠి | సెట్టి | కోమటిపేరియనుబంధము |
| శ్లథ | సట,సడలు | వదలుట |
| శ్లక్ష్ణ | సన్నము | అల్పము |

## ష

| | | |
|---|---|---|
| షండ | సన్నగందు | నపుంసకుఁడు |
| షట్క | చేఱ్క | ఆఱు |
| షడ్ఢక | సడ్డకుఁడు | తోడియల్లుఁడు |
| ష్ఠా | తాచు | తోలుచు |

## స

| | | |
|---|---|---|
| సంకట | సంగడము | కష్టము |
| సంకరగార్దభ | కంకరగాడిదె | వేసడము |
| సంకు | జేంగు | జవ్వాది |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| సంకోచ | జంకె | బెదరింపు |
| సంగత | సంగాతి, సంగడీఁడు | స్నేహితుఁడు |
| | సంగడము, సంగాతము | స్నేహము |
| సంగ్రహ | సేకరించు | గడించు |
| సంచయ | సంచిక | కొన్ని పత్రికలపుస్తకము |
| సంజ్ఞ | సన్న, సైగ | జాడ |
| సంతతి | సంతు | సంతానము |
| సంతోష | సంతసము | ఆమోదము |
| సంధాన | జతను | కూడిక |
| సందేహ | సందియము | సంశయము |
| సందోహ | చిందము | గుంపు |
| సంధాన | సంతన | కూరుపు |
| సంధి | సంది | రాజీ |
| | సందు | ఎడము |
| సంధ్యా, సంధా | సంజె, సందె | సందవేళ |
| సంధ్యారాత్రి | సందరాతిరి | నిశీథము |
| సంపుట | సంబెళ | పొందాను |
| సంభార | సంబారువు | మెంతిపొడి |
| సంభావన | సంబాళించు | ఆదరించు |
| సంభ్రమ | సంబరము | తత్తఱపడుట |
| సక్తు | సత్తు | పేలపిండి |
| సఖ | సకుఁడు | హితుఁడు |
| సఖీ | సకియ | చెలికత్తె |
| సగంధ | సంగడీఁడు | హితుఁడు |
| సజ్జికా | సజ్జ | పడకటిల్లు |
| సుజన | సనువు | సుజనుఁడు |
| సటా | జడ | జట |
| సతత | సతము | స్థిరమైనది |
| సత్య | సత్తు | నిజము |
| సత్యంకార, సత్యాకృతి | సంచేకరువు | బయానాపేమీ |
| సత్రి | సత్తరువు | ధర్మశాల |
| సత్వ | సొత్తు | సొమ్ము |
| | సత్త, సత్తువ | బలము |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| సదస్ | చేదురు | సభ |
| సదృశ | సరి | సమానము |
| సన్నిపాత | జెన్ని | విషమజ్వరము |
| సన్యాసి | సన్నాసి | యతి |
| సపత్ని | సవతి | తోటిభార్య |
| సప్త | సత్తి | ఏడు |
| సబళ } సబిల } | సబరి | ఒకయాయుధము |
| సమ | సామించు,సోమించు | సరిపోలు |
| సమచతుష్క | చచ్చౌకము | నలుచదరము |
| సమతా | సవతు,సామెత | సామ్యము |
| సమయ | సమ్మె | జాతికట్టు |
| సమర్త | సమర్తాడు | రజస్వలయగు |
| సమాస | సమసనము | అనేకపదములేకపదమగుట |
| సమాధాన | సమానము | సమ్మతి |
| సముద్ర | సందరము,సంద్రుఁడు | సాగరము |
| సమ్మర్ద | సరమదము | ఒత్తిడి |
| సమ్మేళన | సమేళము | కూడిక |
| సర | { చేరు | బొందు |
| | { సరి | దండ |
| సరగ | సరిగె | తావళపుఁబూస |
| సరణి | సరవి | క్రమము |
| సర్జ | సజ్జలు | ఒకసస్యము |
| సర్జరస } సర్వరస } | సజ్జరసము | ఒకధూపద్రవ్యము |
| సర్జకాక్షార } సర్జక్షార } | సజ్జాకారము | ఒకచెట్టునఁదీయునుప్పు |
| సర్ప | సప్పము | పాము |
| సవితృ | సయితుఁడు | సూర్యుఁడు |
| సవ్యసాచి | కవ్వడి | అర్జునుఁడు |
| సస్య,శస్య | సస్సెము | పయిరు |
| సహా | { సై | పిసలు |
| | { సైచు | ఓర్పు |
| సహజ | సాజెము | స్వభావము |
| సహన | సయింపు,సయిరణ | ఓరుపు |
| సహవాస | సావాసము | మైత్రి |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| సహవాసి | సావాసి | ఖోజ్జా |
| సహాటన | సయాటము | స్త్రీపురుషులసహక్రీడ |
| సహాయ | సాయము | తోడు |
| సహిత | సైతము | కూడ |
| సాక్షి | సాకిరి | చూచినదిచెప్పువాఁడు |
| సాచీ | సోఁచు | సాఁగించు |
| సాధన | సాదన | గరిడి,అభ్యాసము |
| సాధు | సాదు | మంచిది |
| సాధుశక్తి | సాదుసత్తి | సుజనుపటిమ |
| సామజాగార | సజ్జారము | ఏనుఁగుసాల |
| సామి | సవము,సాము | అరభాగము |
| సార | సోరు,చేఱు | కాఁచినచింతపండురసము |
| సార్థ | సాతు | బాటసారులసంఘము |
| సింఘాణ | చీమిడి | ముక్కుశ్లేష్మము |
| సిందుర<br>సిందూర<br>సింఘుర<br>సింధూర | చెందురము<br>చెందిరము<br>సిందురము | కుంకుమువంటియెఱ్ఱనిపొడి |
| సిందువార | సిందరము | ఒకచెట్టు |
| సింధు | చెందు,ఇందు | ఒకయుప్పు |
| సింహ | సింగఁడు<br>సింగము | ఎఱుకు<br>హర్యక్షము |
| సింహపీఠ | సింగపుఁబీట | సింహాసనము |
| సింహళ | సింగళము | రావణునిలంక |
| సింహరావ | సింగరవళి | సింహగర్జనము |
| సింహుండ | చెముడు,చెమరు | ఒకపాద |
| సిద్ధకిన్నర | సిద్దకిన్నెర | ఒకతంత్రివాద్యము |
| సిద్ధాయ | సిద్దాయము | వ్యయశేషము |
| సిధ్మ | సిబ్బియము | ఒకరోగము |
| సిల్హ | చిల్ల | ధూపద్రవ్యము |
| సుఖ | సుకము,సుగము,సోము<br>సొగయిక,సొక్కు | సౌఖ్యము<br>విస్మృతి |
| సుఖవాసి | సుకవాసి | సుఖి |
| సుఖిని | సుకిని | సుఖవతి |
| సుఖుని | సికియ | ఒకపిండివంట |
| సుగంధిమూల | సుగందిపాల | ఒకమందుమూలిక |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| సుఘటిత | సుగ్గడితము | ముదుగు నేతబట్ట |
| సుధా | సుద్ద | తెల్లమన్ను |
| సునిహిత | సున్నితము | ఖచితము |
| సుపానీయ | సుపాణి | శుభ్రజలము, ముత్రము |
| సుబ్రహ్మణ్య | సుబ్బఁడు | ఒక పేరు |
| సుభగ | సొబగు | సౌందర్యము |
| | సొబగుఁడు | సుందరుఁడు |
| సురా, సురి | సారా | కాఁచినకల్లు |
| సురంగా | సొరంగము | కన్నము |
| సురపున్నాగ | సురపొన్న | ఒక చెట్టు |
| సులభ | చులుకన, సులువు | తేలిక |
| సూక్తి | సుద్ది | వృత్తాంతము |
| సూచ్ | చూచు | కను |
| సూచి | సూది | కుట్టుపనిముట్టు |
| సూనాకర | సూనరి | దుష్టుఁడు |
| సూపకార | సువారము | వంట |
| సూయన } సూయాన } | సూయాణము | శత్రుభీకరదండయాత్ర |
| సూర్యపట | సూరెపుటము | మేల్మొగమాలు |
| సృక్వ, సృక్వీ | సెలవి | పెదవులుకలియుమూల |
| సృగాల | సగ్గాలము | నక్క |
| సృష్ట | చిట్ట | కల్పితము |
| సేవంతి | చేమంతి, సేమంతి | ఒక పూలచెట్టు |
| సేవన | సీవనము | బట్టకుట్టు |
| సేవికా | సేవియ | గోదుమపిండితాలిక |
| సోపాన | సోపనము | మెట్టు |
| సోమయాజి | సోమాసి | యాగముచేసినతఁడు |
| సోమలతా | సోమిద | తిప్పతీఁగె |
| సోమవల్క | సోమి | ఒక చెట్టు |
| సోమవల్లరి | సోమెద | ఒకకూరాకుచెట్టు |
| సోమవల్లి | సోమిద | ఒకతీఁగ |
| సౌందర్య | చేందు | చక్కని |
| స్కంద | కందుఁడు, సందుఁడు | కుమారస్వామి |
| స్కంధ | కందము | మూఁపు |
| | కండె, కండెము | గట్టిపడ్డజబ్బ |
| స్కంధపట్టికా | గందపట్టె | తలుపునకుసడ్డపట్టె |
| స్థలవ | జీరుగుడు | తొనకు |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| స్తంభ | కంబము<br>దుబ్బు | గుంజ<br>గడ్డికంబము |
| స్తంభబలి | కంబవల్లి | వడుగుచివరఁజేయుతంతు |
| స్తన | చన్ను | కుచము |
| స్తనద్వయి | చనుదోయి | జోడుకుచములు |
| స్తూప | తూపి | దేవాలయవిమానము |
| స్తోమ | సోమము | విక్రమము |
| స్త్రీ | ఇంతి | ఆఁడుది |
| స్థల | తలము | చోటు |
| స్థాన | ఠాణా, తావు, తానము | తావు |
| స్థానక | తానకము | జెట్టినిలుచుభేదము |
| స్థాపన | తాపు | అవలంబనము |
| స్థాయి | ఠాయి | నిలుకడ |
| స్థాల | తలియ | కంచము |
| స్థాలి, స్థాలిక | తెలిగ, తళియ | కంచము |
| స్థావర | తావరము | స్థిరమయినది |
| స్థిర | తిరము | శాశ్వతము |
| స్థూల | తోరము<br>దూలము | లావయినది<br>తనాబీ |
| స్థూలహస్త | తోరహత్తము | మల్లబంధవిశేషము |
| స్నాన | తానము | మజ్జనము |
| స్నిగ్ధ | నిద్దము | నునుపు |
| స్నేహ | నెయ్యము, నేయము, నేస్తము<br>నెయ్యుఁడు, నేస్తు<br>నేయి | మైత్రి<br>మిత్రుఁడు<br>ఘృతము |
| స్పర్ధా | పంతము, పద్దు | ప్రతిజ్ఞ |
| స్పర్శవేధి | పరసవేది, పరుసవేది | ఇనుమంటినబంగారమగురసము |
| స్పష్ట | చేట్టము | విధి |
| స్పృక్కా<br>పృక్క | షక్కె<br>పిక్క<br>ప్రక్కె | ఒకగ్రంథ్యము<br>ఒకతీఁగ<br>ఒకచెట్టు |
| స్ఫటా | పటము, పడిగె | ఫణము |
| స్ఫటాధారి | పడగదారి | పాము |
| స్ఫటిక<br>స్ఫాటిక | పటిక<br>పటికము-(పూస)<br>పలుగు-(రాయి) | మందుదినుసు<br>మెఱుగయినవి |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| స్ఫోటక | పాటకము, పోటకము | మశూచి |
| స్మృతి | చుమి, సుమ్మి | సుమా |
| స్మర | మరుఁడు | మన్మథుఁడు |
| స్యంద | చిందు | కారు |
| | చిందులు | గంతులు |
| స్రుక్ | సోగు | దండ |
| | సరిగె | జరీ |
| స్రక్వ | సెలవి | పెదవులుకలియుతావు |
| స్రవా, స్రవణ | సోగ | జీడిమామిడిచెట్టు |
| | సోన | స్రవించునది |
| స్రాక్ | సరగ | త్వరగా |
| స్రావ | సోవ | నూకలగంజి |
| స్వచ్ఛ | సొకచ్ఛము, సాచ్ఛము | నిర్మలము |
| స్వతంత్ర | సొంతము, సాతంతిరము | హక్కుగలది |
| స్వత్వ | సొత్తు | హక్కు |
| స్వభావ | సభాము | గుణము |
| స్వమ్ | సొమ్ము | ధనము |
| స్వర | సొరము | కంఠధ్వని |
| | సరము | నాదము |
| స్వర్ణ | సొన్నము, సొన్నా | బంగారము |
| స్వర్ణకార | సొన్నారి | బంగారుపనివాఁడు |
| స్వామి | సామి | ప్రభువు |
| స్వామిని | సాని | ప్రభుభార్య |
| స్వీకార | సేకరము | సంగ్రహము |
| స్వేద | సేద | శ్రమ |

## హ

| | | |
|---|---|---|
| హంస | అంచె | చక్రాంగపక్షి |
| హంసపద | అంచెపదము | హంసపాదుగుఱ్ఱు +. |
| హంసయానా | అంచెయాన | హంసవలెనడచుస్త్రీ |
| హంసరాహుత్త | అంచెరాతు | బ్రహ్మ |
| హనుమత్ | హనుమ, అనుమఁడు | ఆంజనేయుఁడు |
| హారణ | అరణము | బిడ్డకిచ్చుకానుక |
| హరితాళ, హరీతాల | హరిదళము, అరిదళము | ఒకపచ్చరంగుదినుసు |
| హరిద్రా | హళది, అడదది, అలది, అళిది | పసపు |

| (ప్రకృతి) | (వికృతి) | (టీక) |
|---|---|---|
| హరివాణ | అరివాణము | చిన్నపళ్లెము |
| హర్ష, హరవ | హయసము, అరసము, అరిసెము | సంతోషము |
| హళ, హలా | అల, అలా | సంబోధనార్థకము |
| హస్త | హత్తము | చేయి |
| హస్తత్రాణ | అత్తెము | చేతికిఁదొడుగుకొనుకవచము |
| హస్తి | అత్తి, హత్తి | ఏనుఁగు |
| హోర | ఆలము | యుద్ధము |
| హింగు | ఇంగువ | ఒకసంభారవస్తువు |
| హింగుళ | ఇంగిలీకము | కొండకావిరాయి |
| హింతాల | ఈదాఁడు | ఒకచెట్టు |
| హిక్కా | ఎక్కిలి, వెక్కిలి, వెక్కు | శైత్యమునఁబుట్టునది |
| హిత | ఇతవరి | అనుకూలుఁడు |
| | జితము, హితవు | అనుకూలము |
| హితకర | ఇతకరి | ఇచ్ఛతీర్చువాఁడు |
| హిమ | ఇఁగము, ఇవము | మంచు |
| | ఇవక, ఈవము | తేమ, జలుబు |
| హుం | ఊఁ | ప్రశ్నార్థకము |
| హుంకార | ఊఁకర | ఊఁకొట్టుట |
| హుడుక్కా | డుబుడుక్కా, హుడుక | ఒకవాద్యము |
| హృత్, హృదయ | ఎద, ఎడఁద | మనస్సు |
| హేడ | ఎడ్డె | మూఢుఁడు |
| హేడక | హెగ్గడీఁడు | ఖోజా |
| హేయ | ఏవ, ఏవము | అసహ్యము |
| హేరంబ | ఎనుము | గేదె |
| హేరాళ | ఏరాళము | అధికము |
| హేల | ఏల | జోల |
| హేలిత | ఎల్లితము, ఏలిదము | చుల్కఁతనము |
| హై | ఓయి | సంబుద్ధ్యర్థకము |
| హోడ | ఓడ | నావ |
| హోరా | ఓర | రేఁబవలు |

సంపూర్ణము.

# అన్యరూపదీపిక.

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అంకణము, | అంగణము, అంగనము | ముంగిలి |
| అంకియ | అంకె | అంకము |
| అంకు | అంకిలి | సెలవి |
| అంకురము | అంకూరము | మొలక |
| అంకోడము | అంకోలము | ఊడుగుచెట్టు |
| అంగద | అంగలార్పు | మనోవ్యథ |
| అంగి | అంగీ | నిలువుచొక్కా |
| అంగుళము | అంగుళి | వ్రేలు |
| అంఘ్రిపర్ణిక | అంఘ్రివల్లిక | కోలపొన్న చెట్టు |
| అంచనము | అర్చనము | దేవపూజ |
| అంజే | హజ్జ | పాదము |
| అంజన | అంజని | హనుమంతుని తల్లి |
| అంత | అంతట | పిమ్మట |
| అంతము | అంత్యము | తుద |
| అంతరంగము | అంతఃకరణము, అంతస్సు | మనసు |
| అంతరిక్షము | అంతరీక్షము | ఆకాశము |
| అంతర్ధ | అంతర్ధి | కప్పుట |
| అంతశయ్య | అంకశయ్య | కాడు [దప్పు |
| అంతిక | అత్తిక | నాట్యపరిభాషయం |
| అంతిపురము | అంతిపురి | అంతఃపురము |
| అంతేవసాయి | అంతావసాయి | మంగలి |
| అంత్రము | ఆంత్రము | ప్రేగు |
| అందలు | అందోలు | జనులెల్లరు |
| అందియ | అందె | కాలినగ |
| అందోళము | ఆందోళనము, ఆందోళిక, దోళ | అందలము |
| అంధాతమసము | అంధతమసము | కటికిచీకటి |
| అంపు | { అనుపు, అంచు, అనుచు, పంపు, పనుపు, పంచు, పనుచు, పుచ్చు } | పోవునట్లుచేయు |
| అంవీరుఁడు | హంవీరుఁడు | ప్రభువు |
| అక | అక్క | అప్ప |
| అకట | అక్కట | అయ్యో |
| అకూపారము | కూపారము | సముద్రము |
| అక్కటిక | అక్కటికము, అక్కస | దయ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అక్కడ | ఆకడ, ఆడ | అచట |
| అగడ్త | అగడిత, అగడ్డె | కందకము |
| అగరువు | అగురువు | ఇరుగుడుచెట్టు |
| అగలు | అగళు | అగరు |
| అగస్త్యుఁడు | అగస్తి | ఒకమహర్షి |
| అగారము | ఆగారము | ఇల్లు |
| అగిసి | అగిసియ, అగిసె, అవిసె. అవిసియ, అవిసె | ఒకచెట్టు |
| అగు | అవు, ఔ | కాఁగలుగు |
| అగ్గలము | అగ్గలిక | ఉత్సాహము |
| అగ్గింపు | అగ్గలింపు | పొగడుట |
| అగ్రము | అగ్రిమము, అగ్రీయము, అగ్ర్యము, అగ్రము | ముఖ్యవస్తువు |
| అగ్రేసరుఁడు | అగ్రసరుఁడు, అగ్రసరి, అగ్రతస్సరుఁడు | పురోగామి |
| అచట | { అచ్చట. అచోటు, అచ్చోటు, అ చ్చోటు, అచ్చో, అటు } | అక్కడ |
| అచ్చము | అచ్చికము | ప్రసన్నము |
| అచ్చెరియము | అచ్చెరువు | ఆశ్చర్యము |
| అజకవము | అజగవము, అజగావము, అజాగవము, అజీగవము | శివునివిల్లు |
| అజాజీవుఁడు | అజాజీవి | మేఁకలఁగాచువాఁడు |
| అటక | అట్టువ | అరప |
| అటరుషము | అటురూషము | అడ్డసరము |
| అటు | అట్టు | ఆలాగు |
| అట్టము | అట్టాలకము | కోటవాకిలిమీఁదియిల్లు |
| అడవికాఁకర | అఁగాఁకర | కర్కాటిక |
| అడఁగు | అణఁగు | క్రుంగు |
| అడఁది | అలఁది, అళఁది, అళిది, హాళది | పసపు |
| అడుకులు | అటుకులు | పృథుకములు |
| అడుగు | అడ్గు | పాదము |
| అడ్డము | అడ్డె | కప్పు |
| అణవ్యము | అణవీనము | చిఱువడ్లుపండుచేల |
| అతటము | ఆతటము | ఎక్కరానితావు |
| అతఁడు | ఆతఁడు | ఆయన |
| అతిసువు | అతినావము | ఓఁడకుమించిననీరు |
| అతిబల | బల | చిట్టాముదపుఁజెట్టు |
| అతిక్రమము | అభిక్రమము | { నిర్భయముగాశత్రువు పై కేఁగుట |
| అదురు, | ఉదురు | రెంటినిజేర్చు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అధ్వము | అధ్వము | మార్గము |
| అదను | పదను | తరుణము |
| అదరుచు | అద్రుచు | త్రుళ్లుచు |
| అది | అద్ది, ఆయది, అయ్యది | ఆవస్తువు |
| అద్దటి | ఆదటి, అతల, అవతల, అవల, అవ్వల, అసల | అటున్నదటి |
| అధ్యవసాయము, | వ్యవసాయము | ఘనకార్యోద్యోగము |
| అధ్వన్యుఁడు | అధ్వనీనుఁడు | బాటసారి |
| అధ్వర్యుఁడు | అధ్వర్యువు | క్రతువుచేయించు ముఖ్యుఁడు |
| అనంటి | అరఁటి, అంటి | కదళీవృక్షము |
| అనడుహి | అనడ్వాహి | గోవు |
| అనవరతము | అనారతము, అవిరతము | ఎల్లపుడు |
| అనవుఁడు | నావుఁడు | అన్నపిదప |
| అనిమిషము | అనిమేషము | చేఁప |
| అనిమిషులు | అనిమేషులు | దేవతలు |
| అనుత్తమము | [illegible]త్తమము | శ్రేష్ఠము |
| అనుపము | అనూపము, అనుపము | జలసమృద్ధిగలదేశము |
| అనుష్టుక్కు | అనుష్టుప్పు | 8వ ఛందము |
| అన్ని | అవి | సర్వవస్తువులును |
| అన్ను | అన్నుక | అందుది |
| అన్వవాయము | అన్వయము | వంశము |
| అన్వితము | అన్వీతము | కూడుకొనినది |
| అన్వీక్షకి | ఆన్వీక్షికి | తర్కశాస్త్రము |
| అన్వేషణ | అన్వేషణము, అన్వీక్షణము | వెదకుట |
| అపగ | ఆపగ | ఏఱు |
| అపచాయితులు | అపచితులు | మ్రొక్కఁబడిన దేవతాదులు |
| అపదంశము | ఉపదంశము | ఊఱుఁగాయ |
| అపథము | అపంథ | తప్పుదారి |
| అపసదుఁడు | అపశదుఁడు | హీనుఁడు |
| అపవర్జనము | అపసర్జనము | త్యాగము |
| అపవిమ | ఉపవిష | అతివస |
| అపసడి | సడి | దూఱు |
| అపస్కరము | అపస్కారము | పెద్దైనబండి యవయవము |
| అపారము | అవారము | అవలిదరి |
| అపిధానము | పిధానము | కప్పుట |
| అవిభవము | అభిభవము | తిరస్కారము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| అపుడు | అప్పుడు, అప్డు | ఆవేళను |
| అపూపము | పూపము | ఒక భక్ష్యము |
| అపోదకి | ఉపోదకి, ఉపోదకి, ఉపోదక, ఉపోదిక | దుంపబచ్చలి |
| అప్ప | అబ్బ | తండ్రి |
| అప్ప | అప | అక్క |
| అప్పచ్చి | అప్పము | భక్ష్యము |
| అప్పతి | అపాంపతి | సముద్రుడు, వరుణుడు |
| అప్పన | అప్పనము | అర్పణము |
| అప్రత్యక్షము | అప్రత్యక్షము | అగోచరము |
| అబ్బురము | అబ్రము | వింత |
| అభికుడు | అభీకుడు | కాముకుడు |
| అభిఘారము | అఘారము | నెయి |
| అభిచరము | అభిచారము | తోడ్పాటు, పరహింస |
| అభినవ | నవ | క్రొత్త |
| అభిమాతి | అభియాతి, అభీఘాతి | విరోధి |
| అభిషువు | అభీషువు | సూర్యకిరణము |
| అభీరువు | భీరువు | పిల్లపిచ్చర |
| అభీష్టము | అభీప్సితము | ఇచ్చకువచ్చినది |
| అభ్యమితుడు | అభ్యంతుడు | వ్యాధిగ్రస్తుడగువాడు |
| అభ్యమిత్రుడు | అభ్యమిత్రీణుడు, అభ్యమిత్రీయుడు | శత్రువులపైదండెత్తు |
| అభ్యసనము | అభ్యసము | చింత |
| అభ్యూషములు | అభ్యూషములు | గుగ్గిళ్లు |
| అమ | అమ్మ | అంబ |
| అమర | అమరి | ఒక స్త్రీ, అమరావతి |
| అమరావతి | అమరవతి | ఇంద్రునిపురము |
| అమర్షము | అమర్షము | కోపము |
| అమవస | అమాస | అమావాస్య |
| అమవస | అమాసస, ఆమావసి, అమావస్య, అమావసి, అమావాస్య, అమా, అమి | అమాస |
| అమానస్యము | అమనస్యము | ప్రసూతిబాధ |
| అమ్మకము | అమ్మకటు, అమ్మకము | విక్రయించుట |
| అమ్లము | అమ్లము, అమ్లము, అమ్లము, అంబ్లము | పులుసు |
| అమ్లిక | అమ్లామ్లిక | చింతచెట్టు |
| అయస్కాంతము | అయఃకాంతము | సూదంటురాయి |
| అయ్యారే | అయ్యారే | అబ్బా |
| అయో | అయ్యో | [illegible] |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అయ్య | అయ | తండ్రి, గౌరవనీయుఁడు |
| అరఁగు | అరుఁగు | తిన్నె |
| అరయు | ఆరయు | విచారించు |
| అరరి | అరరము | తలుపు |
| అరళువు | అరుళువు | దుండిగపుఁజెట్టు |
| అరాతి | ఆరాతి | విరోధి |
| అరాళము | రాళము | సజ్జరసము |
| అరిది | అరుదు | చిత్రము |
| అర్కిమేదము, | అహిమేదము | వెలిచంద్రచెట్టు |
| అర్గళము | అర్గళ | తలుపుగడియ [వేశ్య |
| అర్జుక | అజ్జుక | నాట్యపరిభాషయందు |
| అర్దన | అర్థన, అర్దనము | అడుగుట |
| అర్మిలి | అరులు, అర్లు | కరుణ |
| అర్వాంతము | అర్వానము | గుల్మము |
| అర్హుఁడు | అర్హాంతుఁడు | బుద్ధుఁడు, పూజ్యుఁడు |
| అఱమఱ | అఱమఱిక | అనుమానము |
| అఱక | అఱకము, అఱగము, అఱమవ | అజీర్తి |
| అఱకడ | అఱకడము | మూఁపు |
| అఱు | అఱుత, అఱ్ఱు | మెడ |
| అలక | ఊలక | అలక్ష్యము |
| అలగర్దము | అళిగర్దము, అజగర్దము | నీటిపాము |
| అలమటించు | అటమటించు | వంచించిహరించు |
| అలయిక | అలపు | శ్రమము |
| అలాబువు | ఆలాబువు | సొరచెట్టు |
| అలుగు | అలువు | కోపమొందు |
| అల్పిష్ఠము | అల్పీయము | మిగులఁగొంచెము |
| అల్లన | అల్ల | మెల్లన |
| అల్లిబిల్లి | అల్లిబిల్లిక | పరస్పరప్రీతి |
| అళది | అళిది | పసపు |
| అళి | ఆళి | తేలు, ఎఱ్ఱతేలు |
| అళిందము | ఆళిందము | బయటిచావిడి |
| అళీకము | ఆళీకము | నొసలు |
| అళిది | హాళిది | సరళవృక్షము, పసపు |
| అవగ్రహము | వగ్రహము, అవగ్రాహము | వానలులేమి |
| అవటము | అవటువు | గొయ్యి |
| అవటీటుఁడు | అవసాటుఁడు | నడ్డిముక్కువాఁడు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అస్రపుఁడు | అశ్రపుఁడు | నైరృతి, రాక్షసుఁడు |
| అస్రము | అశ్రము, అస్రువు, అశ్రువు | కన్నీరు |
| అహంకారము | హంకారము | గర్వము |
| అహర్పతి | అహఃపతి | సూర్యుఁడు |
| అహి | అహితుఁడు | శత్రువు |
| అహితుండికుఁడు | ఆహితుండికుఁడు | పాములవాఁడు |
| అహోపురుషిక | ఆహోపూరుషిక | గర్వమున స్వోత్కర్ష నెంచుకొనుట |
| అక్షతలు | అక్షతములు, | పసపు రాచిన బియ్యము, తునుగని బియ్యము |
| అక్షీబము, | అక్షీబము, ఆక్షీబము | మునుగచెట్టు |
| అక్షోహిణి | అక్షౌహిణి | 21870 ఏనుఁగులును, ఇన్ని రథములును, ఇంతకు ౩ రెట్లు గుఱ్ఱములును, ౫ రెట్లు బంట్లును గల సేన |

## ఆ

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఆకారణ | ఆకారణము | పిలుచుట |
| ఆకూతి | ఆకూతము | అభిప్రాయము |
| ఆగడము | అవగడము | ప్రతికూలము |
| ఆగువు | ఆగురము | అంగీకారము |
| ఆజ్ఞ | ఆజ్ఞప్తి | సెలవు |
| ఆటి | ఆతి | కొంగ |
| ఆడపము | ఆడిక | అపవాదము |
| ఆడి | ఆడే, ఆడెలు, ఆడేలు | బాతు |
| ఆడెబలు | ఆడెలు | మేఘపంక్తి |
| ఆతాయి | ఆతాపి | పిన్నగద్ద, జెముడుకాకి |
| ఆతిథ్యము | ఆతిథేయము, ఆతిథేయి | అతిథికొఱకన్నాదులు |
| ఆత్తగంధుఁడు | ఆత్తగర్వుఁడు | పరులచే వెడలఁగొట్టఁబడినవాఁడు |
| ఆత్మ | ఆత్మము, ఆత్ముఁడు | జీవుఁడు |
| ఆది | ఆద్యము | మొదటిది |
| ఆదితేయులు | ఆదిత్యులు | దేవతలు |
| ఆదిమాషకము | ఆద్యమాషకము | ౫ గురువిందగింజలయెత్తు |
| ఆధూతము | ధుతము | కదలింపఁబడినది |
| ఆనకము | ఆణకము | డంకా |
| ఆనతము | అవనతము, నతము | వంగినది |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఆనతి | ఆన | సెలవు [చేదనుపుట |
| ఆనందనము | ఆమంత్రణము | ఆప్తులనాలింగనాదుల |
| ఆనందము | ఆనందథువు | సంతోషము |
| ఆనుపూర్వము | ఆనుపూర్వి | క్రమము |
| ఆపత్తి | ఆప్తి | పొందుట |
| ఆపోగండుఁడు | పోగండుఁడు, పౌగండుఁడు | వికలాంగుఁడు |
| ఆప్లవము | ఆప్లావము | స్నానముచేయుట |
| ఆభీషువు | ఆభీషువు | సూర్యరశ్మి |
| ఆమలకము | ఆమలకి, అమలకము, మలకము | ఉసిరిగచెట్టు |
| ఆమిక్ష | ఆమీక్ష | చెక్కపెరుగు |
| ఆమిదము | ఆముదము | ఒకచమురు |
| ఆమిషము | ఆమీషము, అమిషము | మాంసము |
| ఆము | ఆమిక | పొగరు |
| ఆమె | ఆపె, ఆకె | ఆయమ |
| ఆమెత | ఆమిత, ఆమితి, ఆమతి | విందు, విందుపిలుపు |
| ఆమ్లాతకము | ఆమ్రాతకము | నల్లమామిడిచెట్టు |
| ఆయాయి | అయ్యాయి, ఆయయి, అయ్యయి, ఆయ్యె, ఆయ్యె, ఆయా, అయ్యా, ఆయ, అయ్య | ఆఆ |
| ఆయుధికుఁడు | ఆయుధీయుఁడు | ఆయుధజీవి |
| ఆయుష్యము | ఆయువు | జీవితకాలము |
| ఆయె | అయ్యె | అగుటజరిగెను |
| ఆరటము | ఆరాటము | తాపము |
| ఆరగ్వధము | ఆరగవధము, ఆరుగ్వధము, ఆర్గ్వధము | రేలచెట్టు |
| ఆరడి | ఆరు | అపవాదము |
| ఆరవము | ఆరావము | ధ్వని |
| ఆరాధనము | ఆరాధము | లభ్యము, ముదము |
| ఆరాము | ఆరెము, ఆరిమము | పూఁదోఁట |
| ఆరు | నూగారు | రోమావళి |
| ఆరేవతము | రేవతము | రేలచెట్టు |
| ఆరోగిణము | ఆరోగణము | తినుట |
| ఆరోహాము | ఆనాహాము | నిడివి |
| ఆర్య | ఆర్యి | పూజ్యురాలు |
| ఆర్తి | అర్తి | వింటికొప్పు, పీడ |
| ఆఱుగురు | ఆఱ్గురు, ఆఱువురు, ఆఱ్వురు | 6 మంది |
| ఆలతి | ఆలత్తి, ఆళతి | రాగముపాడుట |
| ఆలపోతు | ఆఁబోతు | ఎద్దు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఇంగిలీకము | ఇంగిలికము, ఇంగలము | కావిరంగు, ఒకరసద్రవ్యము |
| ఇందిర | ఇంది | లక్ష్మీదేవి |
| ఇంద్రాణి | ఇంద్రాణిక | వావింటచెట్టు |
| ఇంద్రావరజుఁడు | ఇంద్రావరుఁడు | విష్ణువు |
| ఇంధనము | ఇధ్మము | సమిధి |
| ఇఁక | ఇఁగ, ఇంక | మఱియు |
| ఇక్కు | ఇక్కువు | స్థానము |
| ఇగము | ఇవము, ఈము | మంచు |
| ఇగురు | ఇవురు | చిగురాకు, ఈఁకిపోవు |
| ఇచట | ఇచ్చట, ఇచ్చోటు, ఇచ్చోటు, ఇచ్చోటు, ఇచ్చో, ఇటు | ఇక్కడ |
| ఇజ్జలము | హిజ్జలము | గన్నేరు |
| ఇటిక | ఇటికె, ఇటుక, ఇట్టిక | ఇష్టక |
| ఇట్చరము | ఇడ్వరము, ఇత్వరము | ఆఁబోతు |
| ఇట్టు | ఇటు | ఈప్రకారము |
| ఇడ | ఇళ | వాక్కు, ఆవు, భూమి |
| ఇతఁడు | ఈతఁడు | ఈయన |
| ఇతము | ఇతవు | హితము |
| ఇత్వరి | ఈత్వరి | అంకులాడి |
| ఇది | ఇద్ది, ఈయది, ఇయ్యది | ఈవస్తువు |
| ఇద్దఱి | ఈదఱి, ఈతల, ఇవలల, ఈవల, ఇవ్వల, ఇవల | ఇటున్నదఱి |
| ఇన్ని | ఇని | ఇంతలెక్కగలవి |
| ఇపుడు | ఇప్పుడు, ఇప్డు | ఈవేళను |
| ఇబ్బడి | ఇమ్మడి, ఇనుమడి, ఇరుమడి | రెట్టింపు |
| ఇయ్యకోలు | ఇప్పికోలు, ఈకోలు | సమాధానము |
| ఇరిణము | ఈరిణము | చౌటినేల |
| ఇరు | ఈరు, ఈ | రెండు |
| ఇఱుకు | ఇఱుము | పట్టెపట్టనిసందు |
| ఇలికము | ఇలి | ఎలుక |
| ఇల్లఁటము | ఇల్లండ్రము | ఇల్లటికము |
| ఇల్లులు | ఇండులు, ఇఁడ్లు | గృహములు |
| ఇల్వకములు | ఇల్వకములు, ఇన్వకములు | మృగశిరపైనక్షత్రములు |
| ఇవి | ఇవ్వి, ఈయవి, ఇయ్యవి | ఈవస్తువులు |
| ఇష్టక | ఇష్టిక | ఇటిక |
| ఇసు | ఇసుక, ఇసుము | సికత |
| ఇసుఁగు | ఇసువు, నిసుఁగు, నిసువు | పసిబిడ్డ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|

## ఈ

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఈకొను | ఈయకొను, ఇయ్యకొను | ఒప్పుకొను |
| ఈఁగ | ఈవ | మక్షికము |
| ఈగి | ఈవి | త్యాగము |
| ఈడితము | ఈళితము | పొగడఁబడినది |
| ఈఁదర | ఈఁద | చలిగాలి |
| ఈఁదు | ఈఁదాడు | ఈఁతచెట్టు |
| ఈదృశము | ఈదృక్షము, ఈదృక్కు | ఇటువంటిది |
| ఈమె | ఈపె, ఈకె | ఈయమ |
| ఈరసము | ఈరస, ఈసు | దీర్ఘకోపము |
| ఈరు | ఈరలు | మీరు |
| ఈరెండ | నీరెండ | లేఁతయెండ |
| ఈలకఱచు | ఇలకఱచు | బిగఁబట్టు |
| ఈళి | ఈళిక | చూరకత్తి |
| ఈవి | ఈవిల | నిమిచాకత్తి |
| ఈశి | ఈశాని | పార్వతీదేవి |
| ఈశ్వర | ఈశ్వరి | గౌరి, ఈశ్వరిచెట్టు |
| ఈష | ఈశ | ఏఁడికోల |
| ఈషిక | ఇషీక | కుంచె, కలము |

## ఉ

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఉంగరము | ఉంగ్రము | అంగుళీయకము |
| ఉంద్రము | ఉంద్రస | వెలిచంద్రచెట్టు |
| ఉందురువు | ఉదురువు, ఉందురము | ఎలుక |
| ఉకము | ఊకము | చర్మము, ఆనందము |
| ఉక్రుడ | ఉక్రుణము | దుస్సహత్వము |
| ఉచకము | రుచకము | ఆముదపుఁజెట్టు |
| ఉచిత | ఉచ్చిఁత | ఉస్తె |
| ఉచ్ఛ్రాయము | ఉచ్ఛ్రాయము | మ్రాఁకులపొడవు |
| ఉజ్జగము | ఉజ్జన | ఉత్సజ్జనము |
| ఉదుత | ఉఱుత | చిట్టెలుక |
| ఉడుపుష్పము | ఓషధిపుష్పము | దాసానిచెట్టు |
| ఉడులు | ఉడువులు | నక్షత్రములు |
| ఉడూఖలము | ఉలూఖలము | రోలు |
| ఉతము | ఊతము | కుట్టఁబడినబట్టు |
| ఉతుకు | ఉదుకు | ధావనముచేయు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఉత్తుఁడు | ఉన్మనసుఁడు | ఇష్టపదార్థములకై యెదురుచూచువాఁడు |
| ఉత్తంసము | అవతంసము, వతంసము | కర్ణశిరోభూషలు |
| ఉత్పతిష్ణువు | ఉత్పతిత | ఎగయునైజముగలది |
| ఉత్ఫుల్లము | ఉత్ఫుల్లము | విడలినది |
| ఉత్థానము | ఉద్ధానము | కట్టుట, లేచుట |
| ఉదకము | ఉదము, దకము, ఔదకము | నీరు |
| ఉదశ్విత్తు | ఉదస్విత్తు | సగమునీరుకలసినచల్ల |
| ఉదుంబరము | ఔదుంబరము | రాగి, మేడిచెట్టు |
| ఉద్దర | ఉద్దర్వ | వడ్డిలేనియప్పు |
| ఉద్దవడి | ఉరువడి | వేగము |
| ఉధ్మానము | ఉత్థానము, ఉధ్మానము, ఉధ్వానము | ప్రొయ్యి |
| ఉద్భిత్తు | ఉద్భిదము, ఉద్భిజ్జము | చెట్టు |
| ఉన్నాయము | ఉన్నాయము | క్రిందిదానిమీఁదికెత్తుట |
| ఉన్మాథము | ఉన్మంథము | చంపుట |
| ఉన్మీలితము | ఉన్మిషితము | వికసించినది |
| ఉపకార్య | ఉపకారిక | రాజులవిడిదియిల్లు |
| ఉపగ్రహము | స్వగ్రహము, ప్రగ్రహము | పగ్గము |
| ఉపచరము | ఉపసరము | మాలునిల్చుకాలము |
| అపధి | ఉపాధి | కపటము |
| ఉపనిష్క్రరము | ఉపనిష్క్రరము | దుర్గపుపురరాజమార్గము |
| ఉపమ | ఉపమానము | పోల్కికిసాధనము |
| ఉపయమము | ఉపయామము | పెండ్లి, యమునిదాపు |
| ఉపరమము | ఉపరామము | చాలించుట [కాగము |
| ఉపవస్తము | ఔపవస్తము | యాగకర్త చేయునుప |
| ఉపవాటిక | ఉద్పవాటిక | వేశ్యలయింటితోఁట |
| ఉపాధ్యాయ | ఉపాధ్యాయిని | చదువుచెప్పుస్త్రీ |
| ఉపాలంభము | ఉపలంభము | నిందగలయుగతాళి |
| ఉపాసము | ఉపవసము | పస్తు |
| ఉప్పన | ఉప్పు | లవణము |
| ఉప్పట | ఉప్పత | రద్ది |
| ఉప్పతి | ఉప్పతిల్లు | పుట్టుక |
| ఉమ్మగిల్లు | ఉమ్మగిలు | ఉడికిల్లు |
| ఉమ్మగము | ఉమ్మరిక, ఉమ్మలిక, ఉమ్మ | ఉష్మము |
| ఉమ్మి | ఉమి | ఊర్మి |
| ఉమ్మెత | ఉమ్మెత్త | ఒకచెట్టు [భూమి |
| ఉమ్యము | ఔమీనము | సల్లధాన్యముపండు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఉయెల | ఉయ్యేల,ఉయాల, ఉయ్యాల,ఉయ్యల, ఊయల,ఊయాల, ఊయేల, ఊయ్యేల, ఉయేల,ఊయెల | డోలిక |
| ఉరగము | ఉరంగమము | పాము |
| ఉరగాక్షము | ఉరగాక్ష్యము | తగిరిసెచెట్టు |
| ఉరరీకృతము | ఉరీకృతము,ఊరీకృతము | అంగీకరింపఁబడినది |
| ఉరస్వంతుఁడు | ఉరస్విలుఁడు | రొమ్ముబలిమిగలవాఁడు |
| ఉరి | ఊరి | అధికము, అంగీకరించుట |
| ఉరుబువు | ఉరుబుకము,ఉరుబూకము,రుబుకము | ఆముదపుఁజెట్టు |
| ఉరువడించు | ఉరువణించు | కడకొత్తు |
| ఉర్వశి | ఉర్వసి,ఊర్వశి,ఊర్వసి | ఒకయప్సరస |
| ఉల్లడ | ఉల్లెడ | చాందినీ |
| ఉల్లువు | ఊల్లువు | కందచెట్టు |
| ఉల్లోచము | ఉల్లాభము | ఉల్లెడ |
| ఉవెత్తు | ఉవ్వెత్తు | ఒకప్పుడే |
| ఉషణ | ఊషణ | పిప్పలిచెట్టు |
| ఉషణము | ఊషణము | మిరియము |
| ఉషరము | ఊషరము | చౌటినేల |
| ఉసిరి | ఉసిరిక | ఆమలకవృక్షము |

## ఊ

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఊఁకు | ఊఁకువ | పూనిక |
| ఊకొను | ఊఁకొట్టు | ఊఊఅనుచువిను |
| ఊఁగు | ఊఁగాడు | ఆందోళించు |
| ఊఁత | ఊఁతము | మోపిక |
| ఊపిరి | ఊరుపు,ఊర్పు | శ్వాసగాలి |
| ఊర్జస్వి | ఊర్జస్విలుఁడు | మిక్కిలి బలముగల [వాఁడు |
| ఊర్ధకము | ఊర్ధ్వకము | ఒకతెగమద్దెల |
| ఊర్ధ్వజ్ఞుఁడు | ఊర్ధ్వజ్ఞువు | పొడుగుకాళ్ళవాఁడు |
| ఊర్మి | ఊర్మిక | తరంగము |
| ఊళులు | ఊర్పు,ఊరులు,ఊర్లు | గాడ్పుములు |
| ఊష్మ | ఊష్మము,ఊష్మకము | గ్రీష్మర్తువు |
| ఊష్మము | ఊష్మలము | ఉక్క |

## ఋ

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఋద్ధము | ఋద్ధి | సమృద్ధి |
| ఋచ | ఋజ,ఋజి | ఋగ్వేదము |
| ఋశ్యప్రోక్త | ఋష్యప్రోక్త | పిల్లపిచ్చర,దూలగొండి |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| ఋశ్యము | ఋష్యము | మనుఁబోతు |
| ఋషి | రుషి | ముని |
| ఋష్టి | రిష్టి | కత్తి |

## ఎ

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| ఎంచుట | ఎన్నుట | గణించుట |
| ఎకసక్కెయము | ఎకసక్కెము, ఎక్కసక్కెయము, ఎక్కసక్కెము, ఎకసెక్కెయము, ఎకసెక్కెము, ఎక్కసెక్కెయము, ఎక్కసెక్కెము | ఎగతాళి |
| ఎకిరింత | ఎక్కిరింత, ఎక్కుడు | వాహనము |
| ఎగయు | నెగయు | పయికిఁబోవు |
| ఎచట | ఎచ్చట, ఎచోటు, ఎచ్చోటు, ఏచ్చోటు, ఎచ్చో, ఎటు | ఎక్కడ |
| ఎచ్చు | హెచ్చు | అతిశయము |
| ఎట్టు | ఎటు | ఏలాగు |
| ఎడఁద | ఎడంద, ఎద, ఎడ, ఎద్ద | హృదయము |
| ఎడయు | ఎడఁబాయు | విడుచు |
| ఎడ్డ | ఎడ | భేదము |
| ఎతఁడు | ఏతఁడు | ఏజనుఁడు |
| ఎది | ఏది, ఎద్ది, ఏయది, ఎయ్యది | ఏవస్తువు |
| ఎదిరికొనుట | ఎదురుకొనుట, ఎదుర్కొనుట, ఎదురుకోలు, ఎదుర్కోలు, ఎదురేగుట | అభిగమనము |
| ఎదురుచు | ఎదుర్చు | మార్కొనుచు |
| ఎన్ని | ఎని | ఎంతలెక్కగలవి |
| ఎన్నిక | ఎనిక | లెక్కించుట |
| ఎపుడు | ఎప్పుడు, ఎప్డు | ఏవేళను |
| ఎముక | ఎమ్ముక, ఎమ్ము | అస్థి |
| ఎరగలి | ఎరవలి | కాలుచిచ్చు |
| ఎఱుపు | ఎఱ్ఱు, ఎఱ్ఱన | రక్తచ్ఛాయ |
| ఎలుఁగు | ఎలువు | భల్లూకము |
| ఎల్లిదము, | ఏలిదము | చులుకన |
| ఎవ్వర్తె | ఎవ్వరిత, ఎవ్వత, ఎవర్త, ఎవరిత, ఎవత, ఎవ్వర్తి, ఎవ్వరితి, ఎవ్వతి, ఎవర్తి, ఎవరితి, ఎవతి, ఎవ్వర్తె, ఎవ్వరితె, ఎవ్వతె, ఎవర్తె, ఎవరితె, ఎవతె, ఎవ్వరుక, ఎవ్వాతుక, ఎవర్తుక, ఎవతుక | ఏయాఁడుది |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| | **ఏ ఐ** | |
| ఏంద్ర | ఎంద్రి,ఏండ్రిక,ఎండ్రికాయ | కర్కాటకము [ము |
| ఏకతానము | ఏకతాళము | గీతవాద్య తాళాభినయ |
| ఏఁకరు, | ఏఁకారు | మిక్కిలికోరు [డు |
| ఏకాగ్రుఁడు | ఐకాగ్రుఁడు | చెదరనిచిత్తముగలవాఁ |
| ఏకుఁడు | ఏకకుఁడు,ఏకాకి | అసహాయుఁడు |
| ఏడుకము | ఏడూకము,ఏడోకము | గుంజలుపాతికట్టినగోడ |
| ఏఁడులు | ఏండ్లు,ఏళులు,ఏళ్లు | సంవత్సరములు |
| ఏతము | ఏతాము | జలయంత్రము |
| ఏధము | ఏధస్సు | సమిధి |
| ఏనుఁగు | ఏన్గు | గజము |
| ఏమరిక | ఏమరుపాటు | ప్రమాదము |
| ఏపె | ఏపె,ఏళ | ఏయము |
| ఏరకము | ఏడకము | గొఱియ |
| ఏలావాలుకము | ఏళవాలుకము | దూతురుబుడము |
| ఏవ | ఏవము | అసహ్యము |
| ఏవాఁడు | ఎవ్వాఁడు, ఎవ్వఁడు, ఎవ్వండు, ఎవఁడు ఎవండు,ఏఁడు | ఏజనుఁడు |
| ఏవారు | ఏవారలు,ఏవాండ్రు,ఎవ్వారు, ఎవ్వారలు ఎవ్వాండ్రు, ఎవ్వరు, ఎవ్వండ్రు, ఎవరు ఎవండ్రు,ఏరు | ఏమనుష్యులు |
| ఐదువ | ఐదువరాలు | సువాసిని |
| ఐరావతము | ఐరావణము | ఇంద్రునేనుఁగు |
| ఐలబిలుఁడు, | ఐలబిడుఁడు | కుబేరుఁడు |
| | **ఒ ఓ** | |
| ఒంటియ | ఒంటె | ఉష్ట్రము |
| ఒండొరమిక | ఒద్దిక | స్నేహభావము |
| ఒకఁడు | ఒకరుఁడు, ఒకరువుఁడు,ఒక్కఁడు, ఒక్కరుఁడు, ఒక్కరువుఁడు, ఒకోఁడు ఒకోరుఁడు,ఒకోరువుఁడు, ఒక్కోఁడు ఒక్కోరుఁడు, ఒక్కోరువుఁడు, ఒరువుఁడు,ఒరుఁడు,ఒండు,ఒడ్డు | ఒకజనుఁడు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఒకరు | ఒకండ్రు, ఒకరులు, ఒకళులు, ఒకళ్లు, ఒకరువులు, ఒక్కరు, ఒక్కండ్రు, ఒక్కరులు, ఒక్కళులు, ఒక్కళ్లు, ఒక్కరువులు, ఒకోరు, ఒకోండ్రు, ఒకోరులు, ఒకోళులు, ఒకోళ్లు, ఒకోరువులు, ఒకొక్కరు, ఒకొక్కండ్రు, ఒకొక్కరులు, ఒకొక్కళులు, ఒకొక్కళ్లు, ఒకొక్కరువులు, ఒరువులు, ఒరులు, ఒండులు, ఒండ్లు, ఒడ్డులు, ఒడ్లు | 'ఒకండు' కు బహువచనము |
| ఒకరిత | ఒకర్త, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక, ఒక్కరిత, ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత, ఒక్కతుక, ఒకోరిత, ఒకోర్త, ఒకోర్తు, ఒకోర్తుక, ఒకోత, ఒకోతుక, ఒకొక్కరిత, ఒకొక్కర్త, ఒకొక్కర్తు, ఒకొక్కర్తుక, ఒకొక్కత, ఒకొక్కతుక, ఒకరితి, ఒకర్తి, ఒకతి, ఒక్కరితి, ఒక్కర్తి, ఒక్కతి, ఒకోరితి, ఒకోర్తి, ఒకోతి, ఒకొక్కరితి, ఒకొక్కర్తి, ఒకొక్కతి, ఒకరితె, ఒకర్తె, ఒకతె, ఒక్కరితె, ఒక్కర్తె, ఒక్కతె, ఒకోరితె, ఒకోర్తె, ఒకోతె, ఒకొక్కరితె, ఒకొక్కర్తె, ఒకొక్కతె, ఓర్గ, ఓర్తి, ఓర్తు, ఓర్తుక | ఒక స్త్రీ |
| ఒగరు | వగరు | కషాయరసము |
| ఒడంబాటు | ఒడంబడిక | అనుమతి |
| ఒడ్డణము | ఒడ్డాణము | సొమ్ములనూలు |
| ఒడ్డనము | ఒడ్డు | మొగ్గరము |
| ఒడ్డనము | అడ్డనము | డాలు |
| ఒడ్డె | ఒడ్డియు, ఒడ్డీండు, ఒడ్డెవాండు | ఓఢ్రుండు |
| ఒప్పన | ఒప్పనము | అర్పణము |
| ఒమ్మిక | ఒమ్మిక | లావు, అనుకూలము |
| ఒయారము | ఓయారము, ఒయ్యారము | సౌందర్యగర్వము |
| ఒయ్య | ఒయ్యన | మెంటమెంట క్రమముగా |
| ఒట్టి | ఒట్టు | కటువు |
| ఒహహో | ఓహహో | అహహో |
| ఓంకర | ఓంకిలి | వాంతి, కోంత |
| ఓగిరము | ఓరము | ఆహారము |
| ఓటరు | ఓటారు | బలముడిగిపోవు [బంధం |
| ఓయి | ఓరి, ఓ | పురుషసంబోధన ను |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఓరణము | ఓసడము | డేగ |
| ఓలమి | ఓలము | కప్పుట,చాటు |
| | ఔ | |
| ఔచితి | ఔచిత్యము | ఉచితునిలక్షణము [ము |
| ఔడవము | ఔదవము | పంచస్వరయుక్తరాగ |
| ఔదస్విత్తము | ఔదస్విత్క్యము | చల్లతోఁదడిపినది |
| ఔపగవము | ఔపగవి | ఉపగవసంతతి |
| ఔరసుఁడు | ఔరస్యుఁడు | భార్యయందుఁ దనకుఁగలిగినకొడుకు |
| ఔర్ధ్వదైహికము | ఔర్ధ్వదేహికము | చచ్చినవానికైయొనాఁడుచేయుదానము |
| ఔశిరము | ౌశీరము | చామరము,దండము |
| | క | |
| కంచుకము | కంచులిక | చొక్కాయ |
| కంటకము | కంట | ఒకయాట |
| కంటె | కంటియ | మెడనగ [ము |
| కంఠీరథము | కణ్ఠీరథము,కణ్ఠీరథము | మనుష్యులుమోయురథ |
| కందుర | కండూర | మూలగొండి |
| కండూయనము | కండూయ,కండూతి,కండువు,ఖండువు | దురద |
| కందర | కందరము | కొండబిలము,రంధ్రము |
| కందరాలము | కర్పలాలము | కొండగోఁగు |
| కందరి | కందారి | ఒకచెట్టు |
| కందుకము | కంతుకము,కందుకము,గండుకము | బంతి |
| కంపరము | కంప్రము | కదలుచేష్ట |
| కంబడి | కంబలి | గొంగళి |
| కంబళము | కబళము | గొంగళి |
| కకపాల | కక్కపాల | సన్యాసులభిక్షాపాత్ర |
| కకుత్తు | కకుదము | ఎద్దుమూఁపురము,రాజచిహ్నము |
| కక్కర | కక్కెర | ఒకపక్షి |
| కచ్చె | కచ్చడము | గోఁచి |
| కచ్చూరము | కచ్చూరము,కచ్చూరకము, కచ్చూరకము,కచూరిక | గంట్లకచోరము |
| కజోయము | కజ్జియము,కజ్జెము,కజ్జము,కజ్జాయము | తినుబండము |
| కటాక్షము | కాక్షము | కడగంటిచూపు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| కటి | కటీగము,కటము,కటకము,కటితటము, | పిరుదు, మొల |
| కటిక | కట్టిక | కసాయి |
| కటికము | కట్టికము | పణిహారి |
| కటిల్లకము | కరిల్లకము | కాకరచెట్టు |
| కటువు | విడంగము | అల్లము, వాయువిడంగము, కారము |
| కటుంభర | కటంభర | కటుకరోహిణి |
| కట్టడ | కట్టడి | నియతి,విధి |
| కటా | కటా,కటం | అయ్యో |
| కట్టె | కట్టియ | కఱ్ఱ |
| కట్లియ | కట్లె | ఒకతీగె |
| కఠినము | కఠోరము | గట్టిది |
| కడంజు | కణంజు | గోకర్ణమృగము |
| కడంత | కణంత | కనుచెవులనడిమిపట్టు |
| కడంతి | కణంతి | కంతి,గోకర్ణమృగము |
| కడను | కడ | తక్కిన |
| కడమి | కడిమి | కదంబవృక్షము |
| కడవసము | కళవసము,కళాసము | ఇల్లిగోలుసంచి |
| కడిల | కడిలము | కట్లతీగె |
| కడుపు | కడ్పు | ఉదరము |
| కడెము | కడియము | కటకము |
| కణంక | కడంక | పట్టుదల |
| కణంగు | కడంగు | ప్రయత్నించు |
| కతకము | కతము | ఇందుపుజెట్టు |
| కత్తలాని | కత్తలాణము,కత్తలము | గుఱ్ఱము |
| కత్తియ | కత్తె | చేయునది,స్త్రీవాచకము |
| కద | కత | కథ |
| కదలిక | కదలుట | చలనము |
| కదళి | కదళ,కందళి,కాదళి | అరటిచెట్టు |
| కదుపు | పదుపు | ఆవులమంద |
| కనరు | కసరు | కోపము |
| కనిష్ఠుడు | కనీయసుడు | తమ్ముడు |
| కను | కనుగొను,కన్గొను, | చూచు |
| కను | కన్ను | నేత్రము |
| కనుంగొన | కనుంగోన | నేత్రాంతము |
| కనుము | కన్నము | కణంగు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| కన్ను | కన్పు | వెదురుకణుపువంటిది |
| కన్నె | కన్నియ | కన్య |
| కన్యాకుబ్జ | కన్యాకుబ్జము | కనోజాపురము |
| కపిలుఁడు | కాపిలుఁడు | సాంఖ్యశాస్త్రవేత్త |
| కపీతనము | పీతనము | అంబారపుఁజెట్టు |
| కపురము | కప్పురము, కప్రము | కర్పూరము |
| కపోణి | కఫణి | మోచెయ్యి |
| కబంధము | కంధము | తలలేనిమొండెము |
| కబరి | కబరీభరము, కబరము | కొప్పు |
| కబరి | కబ్బరి | వాయింటచెట్టు |
| కమ | కమల | లక్ష్మి |
| కమతము | కమ్మతము | వ్యవసాయము |
| కమనుఁడు | కామనుఁడు, కమ్రుఁడు, కామి, కాముకుఁడు, కమిత, కమితృఁడు, కామయిత, కామయితృఁడు | స్త్రీలవలచువాఁడు |
| కమ్ర | కామ | కాఁడ |
| కమ్ర | కమ్మన | మధురము |
| కమ్మర | కమ్మరి, కసుమరి, కుమరి, కరుమల | ఇనుపపనివాఁడు |
| కమ్మరము | కమ్మటము | ఇనుపపని |
| కయి | కై | చేయి |
| కయి | కయిసకుఁడు | కవి, కవీశ్వరుఁడు |
| కయితము | కైతము | కవిత్వము |
| కయివడి | కైవడి | ఒకతుంగగడ్డి |
| కర, కరదు | కెరడు | తరంగము |
| కరకము | కరకు | వడగల్లు |
| కరజము | కరంజము | పులిగోరు |
| కరజము | కరంజకము | కానుగుచెట్టు |
| కరటము | కటము | ఏనుఁగుచెక్కిలి |
| కరడి | కరిడి | ఒకవాద్యము |
| కరడు | కరదు | మాట [పిండి |
| కరంబము | కరంభము | పెరుగులోఁగలిపినపేల |
| కరము | కారము | పన్ను |
| కరవటము | కరాటము | కరండము |
| కరవాలము | కరపాలము, కరాపాలము | నిమిచాకత్తి |
| కరిసు | కరిసెము, కరిసెనము | సేద్యము [దిచోటు |
| కరీరము | కరీరి | ఏనుఁగుదంతముల క్రిం |
| కరూశ | కరుషము | రోగమువలనఁ బుట్టినది |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| రోహిణి | లోహిని,రోహితక,లోహితక | రంజకద్రవ్యముచేఁగాని కోపముచేఁగానియెఱ్ఱబ |
| రోహిణి | కటురోహిణి | కటుకరోహిణి [యినది |
| రోహిషము | రాహిషము | కొండగొట్టి |

## ఱ

| | | |
|---|---|---|
| ఱంకియ | ఱంకె,రంకె | ఎద్దునఱుపు |
| ఱంకుటాలు | ఱంకులాఁడి,ఱంకుఁబోతు,ఱంకెత,రంకుటాలి,రంకులాడి | విటకత్తె |
| ఱంతు | ఱంపు,ఱంపె | దారుణధ్వని[గోయునది |
| ఱంపియ | ఱంపె,రంపియ,రంపె | తోలుఁదాఁటియాకులు |
| ఱయిక | ఱవిక,రయిక,రైక,రవిక,ఱైక | కంచుకము |
| ఱా | ఱాయి,రాయి,ఱప్ప | శిల |
| ఱాయిడి | ఱాపిడి,రాపిడి,రారాపిడి,రాయిడి,రారాపు,ఱంపు | ఒరపిడి |
| ఱెక్క | ఱెట్ట | పార్శ్వము |
| ఱెమ్మ | ఱెంబ | చిన్నకొమ్మ |
| ఱే | ఱేఁడు | రాజు |
| ఱేకు | రేకు | అంచుకమ్మలులేనిబట్ట |
| ఱేఁడులు | ఱేండ్లు | రాజులు |
| ఱొచ్చు | రొచ్చు,రొంపి | బురద |
| ఱోఁత | ఱోయి,ఱొచ్చు | నింద |
| ఱోలు | రోలు | ఉలూఖము |

## ల

| | | |
|---|---|---|
| లంకణము | లంకనము | పస్తు |
| లంకె | లంకియ | బంధము |
| లంకోయిక | లంకోసిక | స్పృక్కయనుదినుసు |
| లంజె | లంజియ,లంజె | వెలయాలు |
| లండి | లండీ,లండు,లంఁడుఁబోతు | కుత్సిసోఁడు |
| లంబనము | లంబమానము | మెడనుఁబ్రేలాడుపేరు |
| లంబి | లంబీ,లెంబి | కుటుంబము |
| లకుచము | లికుచము | కమ్మరేఁగు,గజనిమ్మ |
| లకోరి | లకోరీ | కూర్సికశరము |
| లక్కుమనుఁడు | లక్కుమనుఁడు,లక్కుముఁడు,లచ్చనుఁడు,లచ్చుముఁడు | లక్ష్మణుఁడు |
| లగడ | లగుడు | డేగ |
| లగనము | లగ్గము | లగ్నము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| లగ్నము | వలగ్నము,అవలగ్నము | నడుము |
| లఘుడము | లగుడము | ఇనుపదుడ్డుకఱ్ఱ |
| లచ్ఛనము | లక్కనము | లక్షణము |
| లట్వము | లడ్డువు | చలిమిడిముద్ద,లడ్డు |
| లడ్డువము | లడ్వము,లడ్డు | లడ్డుకము |
| లత | లతిక | తీఁగె |
| లప్పము | లెప్పము | లేప్యము |
| లలాటము | లలాటి | నుదురు |
| లలామ | లలామము | శ్రేష్ఠమయినది |
| లవము | లవనము,లావనము | ధాన్యాదులకోఁత |
| లవుడి | లవుణి,లౌడి,లౌణి,లాటీ | పరిఘము |
| లక్షణ | లక్ష్మణ | ఆఁడుబెగ్గురు |
| లక్షణుఁడు | లక్ష్మణుఁడు | రామానుజుఁడు |
| లక్షము | లక్ష్మము,లక్ష్యము,లక్షణము,లక్ష్మణము | గుఱుతు |
| లాంగలి | లాంగలము | లెరిగొట్టుచెట్టు |
| లాక్ష | రాక్ష,రక్ష | లక్క |
| లాతము | లాతెము | చేతిబెత్తము |
| లాఁపరా | లాఁపరాయి | జలదారిమూఁగినుండు<br>గండ్లరాయి |
| లాలస | లాలసము | అధికమయినకోరిక |
| లావు | లవటి | పక్షితోఁక |
| లాసక | లాసకి | ఆడునట్టిస్త్రీ |
| లాహిరి | లాహిరీ | మత్తు |
| లిపి | లిఖి | వ్రాసినవ్రాఁత |
| లిపికరుఁడు | లిపికారుఁడు | వ్రాయువాఁడు[తోఁక |
| లూమ | లూమము | గుఱ్ఱము మొదలగువాని |
| లెప్ప | లెప్పము,దెప్పము | గుటి |
| లే | లేఁత | చిన్నది,తరుణము |
| లేఖము | లేఖ్యము | జాబు |
| లేఖని | లేఖిని | కలము,గంటము |
| లేడి | లేటి | జింక |
| లేపము | లేహము | భోజనము |
| లేమి | లేమిడి,లేవడి | దరిద్రము |
| లేలిహానము | లేలీహానము | పాము |
| లొంగు | లోఁగు,లోఁగ్గు | లోఁబడు |
| లొజ్జు | లొచ్చు | లోకువ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| లొట్ట | లొత్త,లొటారము | రంధ్రము |
| లొట్టియ | లొట్టె,లొటిపిట్ట, లొట్టిపిట్ట, లొట్టిమంగు,లొటిపిట,లొట్టిపిట | ఒంటె |
| లొడితి | లొడితిలి,లొడిత | ప్రాదేశమాత్రము |
| లోఁగిలి | లోఁగిలి | గృహము |
| లోడి | లోడీ | సాముగుదియ |
| లోపల | లోన,లో | అందు |
| లోయ | లోది | పర్వతమధ్యభాగము |
| లోలము | ఆలోలము | కదలునది [డు |
| లోలుపుఁడు | లోలుభుఁడు | మిక్కిలి,యాసగలవాఁ |
| లోష్ఠము | లోట్టువు, లోష్టువు, లేష్టువు | మంటిగడ్డ |
| లోహాభిసారము | లోహాభీసారము | యుద్ధసన్నద్ధులైన ప్రభువులకిచ్చు హారతి [గు |
| లౌహితి | లౌహిత్యము | ఎఱుపునలుపుఁగలిసినరం |

## వ

| | | |
|---|---|---|
| వంక | వాఁక | నది [కొంకికఱ్ఱ |
| వంకము | వంకాము | కళ్లెపుఁజెత్తెఁద్రిప్పు |
| వంకె | వంకిణి | బాఁకు |
| వంగడము | వంగసము | వంశము |
| వంచోడించు | వంచొలించు | భయపడు |
| వంటయిల్లు | వంటిల్లు | మహానసము |
| వంటియము | వంటెము,వణిత్రము | తాలూకా |
| వండ | వండలి,వండు | ఎండినబురద |
| వంద | రేవంద,వందియ,వందె,వన్నియ,వన్నె | తృణతతివిశేషము |
| వంధ్యములు | వాంధ్యములు | పావకోము |
| వంశకము | వంశిక | అగరుగంధము |
| వకవకలు | వకావకలు | యథాయథలు |
| వక్కణ | ఒక్కణ,వక్కాణము,వక్కణము,వక్కాణ | వ్యాఖ్యానము |
| వక్కరము | వంకర,వంక,వాఁక | వక్రము |
| వక్కరించు | వక్కళించు | తిరుగఁబడు |
| వక్కి | వక్కు,వక్కుపులుగు | కొంగ |
| వగ | వగపు,వనట | విచారము |
| వగరము | వగరు,వగరుపు,వగర్పు | శ్వాస |
| వచనము | వచస్సు, వాచ,వాక్కు | మాట |
| వజీరు | వజీరుఁడు,వజ్జీరు,వజ్జీరుఁడు | మంత్రి |
| వజ్రనిర్ఘోషము | వజ్రనిష్పేషము | వజ్రముఘట్టనవలనధ్వని |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| వటగ | వటారి,వఠర,వశారి | సమర్థుఁడు |
| వట్ర | వట్రన,వట్రువ | వృత్తము |
| వడఁకు | వణఁకు | చలికిజలించు |
| వడియము | వడుకము | వటకము |
| వడుగు | వడుగఁడు | వటువు |
| వడ్డన | వడ్డైన | వడ్డించుట [డు |
| వడ్రంగి | వడ్లంగి,వడ్ల | కొయ్యపనిచేయువాఁ |
| వణిక్కు | వణిజుఁడు,వాణిజుఁడు | వర్తకుఁడు |
| వదన్యుడు | వదాన్యుఁడు | చాలనిచ్చువాఁడు |
| వదిన | వదినె,వదినియ,వన్నె | అన్నపెండ్లము |
| వదుఁడు | వదావదుఁడు | మాటనేర్పరి |
| వధువు | వధుక,వధూటి | స్త్రీ |
| వనము | వణము | అటవి |
| వనరు | వనట,వనపు | ఏడ్పు |
| వనాయుజము | వానాయుజము | వనాయుదేశపుగుఱ్ఱము |
| వనీయకుఁడు | వనీపకుఁడు | యాచకుఁడు |
| వన్నె | వన్నియ | ఛాయ [చీమ |
| వమ్ర | వమ్రి | చెట్టునఁదెట్టెపెట్టునట్ల |
| వయాళి | వయ్యాళి | విహారము |
| వయిరవులు | వయిరాలు,వైరవులు,వైరాలు | నిప్పు |
| వరట | వరటము | కణుదురీఁగ |
| వరట | వారట | ఆఁడుహంస |
| వరణము | వలనము | కనుగ్రుడ్లుత్రిప్పుట |
| వరణము | వరుణము | ఉలిమిరిచెట్టు |
| వరద | వఱవ,వఱత,వఱతి,వఱద,వఱ్ఱు | ప్రవాహము |
| వరము | వర | చల్లగడ్డ |
| వరము | వర్యము,వరేణ్యము | శ్రేష్ఠమైనది |
| వరవుటము | వరవుడము | దాస్యము [ద్రె |
| వరాటకము | వరాటిక | గవ్వ, తామరలోనిమి |
| వరాశి | వరాసి | ముతుకబట్ట |
| వరి | వడ్లు | ధాన్యము |
| వరిగ | వరగ | ఒకధాన్యము |
| వరివసితులు | వరివస్సితులు | సేవింపఁబడిన, యుపా |
| వర్తని | వర్త్మని,వర్త్మము | మార్గము [ధ్యాయాదులు |
| వర్ధని | వార్ధని | గరిగపిడత |
| వర్ధి | వర్ధ్రి,వార్ధ్రి | వృద్ధినొందునది |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| వర్షము | వర్షణము, వార్షణము | వాన |
| వర్షధరుఁడు | వర్షవరుఁడు, వర్షధర్షుఁడు, ధర్షవరుఁడు, ధర్షుఁడు | ఖోజా, నపుంసకుఁడు |
| వర్షాభ్వి | వర్షాభువు | ఆఁడుకప్ప |
| వర్ణిక | వర్ణకము | నీలిమొదలగువన్నె |
| వర్తిష్ణువు | వర్తనుఁడు | తిరుగువాఁడు |
| వర్తులము | వృత్తము | వట్రువయినది |
| వలక్షము | ఒలక్షము, అవలక్షము | తెల్లన |
| వలను | వలఁదు, వలఁదువు | వైపు [మేడ |
| వలభి | వలభి | ఇంటిచూరుకమ్మి, మై |
| వలసతీయము | వలసపోవు | దేశత్యాగమగు |
| వలి | వలిమిరి | వడఁకు |
| వలితము | వల్గితము | ఒకగుఱ్ఱపుఁగడను |
| వలినుఁడు | వలిభుఁడు | ముదిమిచేఁజర్మము ముడుతలుపడువాఁడు |
| వలీకము | వలము | ఇంటిచూరు |
| వలువ | వలువు, వలువము, వల్వము, వల్వ, వలిపె, వలిపము, వెలిపము, వల్పము | చిన్నబట్ట [ట్ట |
| వల్కము | వల్కలము | నార, చెట్టుపట్ట, నారబ |
| వల్గ | వాగ | గుఱ్ఱపుఁగళ్లెపుఁద్రాడు |
| వల్మీకము | వల్మీకము | పుట్ట |
| వల్లకము | వల్లకి | వీణ, అందుగుచెట్టు |
| వల్లవుఁడు | వర్ణవుఁడు | వంటవాఁడు |
| వల్లి | పల్లి | తీఁగె |
| వల్లెవాటు | వలెవాటు, ఒల్లెవాటు, ఒలెవాటు | శృంగారోత్తరీయము |
| వళి | వడి | విశ్రమము [వణము |
| వశిరము | వసిరము | గజపిప్పలి, సముద్రల |
| వస | వజె | ఒకమందుదినుసు |
| వసపడు | వసపోవు | సాధ్యమగు |
| వసార | వసారా | పంచాది |
| వసుధ | వసుద | భూమి |
| వస్నస | స్నస | సన్నపునరము |
| వహము | వాహము | గుఱ్ఱము |
| వా | వాయి | నోరు |
| వాకాటు | వాగాయిత్తము | వాగ్వాదము |
| వాకూచి | వాగుజి, వ్యాకోచి | కాఁలుగచ్చచెట్టు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| వాకొను | వాక్రుచ్చు | పలుకు |
| వాఁక | వాగు | కొండకాలువ |
| వాఁగరల | వాఁగర్త | సముద్రతీరము |
| వాఁగలము | వాగళము, వాగళ్లము | కళ్లెపుమొగి |
| వాగియ | వాగి | తోలువాయు |
| వాగుర | వాగురి | ఉరి, వల |
| వాచేరడము | వాచౌఁరడము, వాచేగడము, వాచేరము, వాచౌరపము | దేవురింపు |
| వాచాటుఁడు | వాచాలుఁడు | అయుక్తభాషి |
| వాజిశాల | వాజిశాలము | గుఱ్ఱాలసాల |
| వాటము | వాటి | ఆవరణగలస్థలము, కం |
| వాఁడి | వాఁడిమి | శౌర్యము [చె, కోరడి |
| వాణిజ్య | వాణిజ్యము | వ్యాపారము |
| వాతకము | వాంతకి | సోమిదపుఁజెట్టు |
| వాతెర | వాతెఱ | అధరము |
| వాధ్రీణసము | వార్ధీణసము | ఖడ్గమృగము |
| వాప్యము | వ్యాప్యము | చెంగల్వకోష్టు |
| వామలూరము | వామలూరువు | పుట్ట |
| వాముఁడు | వామనుఁడు, వామదేవుఁడు | శివుఁడు |
| వారాణాసి | వారాణసి, వారణాసి, వరాణాసి, వరాణసి, వరణాసి, వారణసి, వరణసి | కాశి |
| వారిజేము | వారిదము | బాడిదె |
| వారిభవ్యము | పారిభావ్యము | చెంగల్వకోష్టు |
| వారు | వారలు, వాండ్రు | ఆజనులు |
| వార్తాకి | వార్తాకువు | ములకచెట్టు |
| వార్ధుషి | వార్ధుషికుఁడు | వడ్డికిచ్చుకువాఁడు |
| వాలము | వాలాము | పెద్దపులి |
| వాలు | వాలుక | నిసుపు |
| వాలుఁగంటి | వాలుగకంటి, వాల్గంటి | ఆఁడుది |
| వాలుకు | వాలువు | ఒక వేఁప |
| వాలుఁడు | బాలుఁడు | పిల్లవాఁడు |
| వాల్మికుఁడు | వాల్మికి, వాల్మీకుఁడు, వాల్మీకి | ఒక మహాముని |
| వావురము | వారువము, వార్వము, వారము | గుఱ్ఱము |
| వాశకము | వాసక | అడ్డసరపుఁజెట్టు |
| వాసము | వసనము | వస్త్రము [దలఁచుట |
| వాసన | వాసనము | ముందనుభవించుదానిఁ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| వాసిత | వాశిత | స్త్రీ, ఆఁడేనుఁగు |
| వాసియ | వాసె, వాసిగ్రోలు, వాసెగ్రోలు | పిల్లఁగ్రోవి |
| వాసువు | వాసుదేవుఁడు | విష్ణువు |
| వాస్తుకము | వాసూకము | చక్రవర్తికూర |
| వాస్తుపతి | వాస్తోష్పతి | ఇంద్రుఁడు |
| వింజామర | వింజామరము | సురటి |
| విండులు | విండ్లు, విల్లులు | ధనుస్సులు [శము |
| వికాశము | వీకాశము | ఏకాంతస్థలము, ప్రకా |
| వికిరము | విష్కిరము | పక్షి |
| విఖుఁడు | విఖువు | ముక్కుటివాఁడు |
| విఖ్యుఁడు | విఖ్రుఁడు, విగ్రుఁడు | ముక్కిడి |
| విగ్రహము | విగ్రాహము | వఱపు, కఱవు |
| విజయము | జయము | గెలుపు |
| విజయముచేయు | విజయంచేయు, విచ్చేయు, వేంచేయు | గొప్పవారువచ్చు |
| విటతాటము | విటతటము, వీటతాటము, వీటతటము, విటతాటనము, వీటతాటనము | చెల్లాచెదరు |
| విడిదల | విడిది, విడిపట్టు, విడిపట్టు, వీడు, వీడుపట్టు | శిబిరము |
| విడియ | విడియము, విడెము, విడ్యము, వీడియము, వీడెము, వీడ్యము | తాంబూలపుబీడి |
| విడు | వీడు | రాలు, విడుచు |
| విడుదల | విడుమర, విడి, విడుగడ, విడుగర, విడుపు, విడుపు, వీడుకోలు, వీడ్కోలు | విడుచుట |
| విదువు | విదువు, విధువు | గజకుంభమధ్యభాగము |
| విత | వితా, వెడ | వ్యర్థము |
| వితంసములు | వీతంసములు | ఉరులు మొదలగునవి |
| విత్తు | విత్తనము | బీజము |
| విదురుచు | విదుర్చు, విదులుచు, విదుల్చు, విద్రుచు | వదలించు |
| విదులము | విచులము, విశులము | ప్రబ్బ, నీటిప్రబ్బ |
| విదురజము | విదూరజము | వైడూర్యరత్నము |
| విద్దియ | విద్దె | విద్య |
| విద్యుత | విద్యుత్తు | మెఱుపు |
| విద్రావము | విద్రవము, ద్రవము | పారిపోవుట [నవి |
| విద్రుతము | ద్రుతము | కరిగిన నేయి మొదలగు |
| విధ | ఏధ | సమృద్ధి |
| విధాత | ధాత, విధత, ధత | బ్రహ్మ |
| వినుతము | నుతము | వినుపఁబడినది |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| విధుతి | విధూతి | విసరుట,కదల్చుట |
| విధువము | విధువనము,విధూవనము,విధవనము, విధూన్యము,విధూయము,విధవ్యము,విధావ్యము | విదలింపు |
| విద్ధకర్ణి | విద్ధపర్ణి | పాటచెట్టు |
| వినతేయుఁడు | వైనతేయుఁడు | గరుత్మంతుఁడు |
| వినికి | వినికిడి,వినుకలి,విన్కలి,విన్కి | ఆకర్ణనము |
| విను | విన్ను,మిను,మిన్ను | ఆకాశము |
| విన్న | విన్నన,విన్నబాటు | చిన్నపోవుట |
| విపణ | విపణి | అంగడివీధి |
| విపత్తి | విపత్తు | ఆపద |
| విపర్యయము | విపర్యాసము | తడఁబాటు |
| విపాశ | విపాశము | ఒకనది |
| విఫలము | అఫలము | వ్యర్థమగుట [ము |
| విబంధము | నిబంధము | మలమూత్రబంధనరోగ |
| విభీతకము | విభీదకము | తాడిచెట్టు |
| వియమము | వియామము | చాలించుట |
| వియ్యంపురాలు | వియ్యంపుగాలు,వియ్యపురాలు,వియ్యపుసాని | వీరకత్తె |
| వియ్యము | వీయము,వియ్యంపుఁడు | వీరకాఁడు |
| విరవాది | విరవాజి,విరజాది,విరజాజి | నవమాలిక |
| విరించి | విరించుఁడు. విరించనుఁడు, విరించినుఁడు, విరచనుఁడు,విరిచినుఁడు | బ్రహ్మ [వాఁడు |
| విరోచనుఁడు | విరచనుఁడు | యుద్ధమున గర్వించు |
| విరివి | విరివి,విరివిడి | విస్తారము |
| విఱుగు | విఱుగుడు,విఱుగబాటు,విఱుపు | అపజయము |
| విల్లుదాలుపు | విలుదాలుపు,విలుదాల్పు,విలుకాఁడు, విల్కాఁడు | ధన్వి |
| వివచ్ఛము | వివ్వచ్ఛము | భీభత్సము |
| విశము | విషము | అమేధ్యము |
| విశాఖ | విశిఖ | ఒకనక్షత్రము |
| విశ్రమము | విశ్రామము | యతి,బడలికతీర్చికోలు |
| విశ్వకేతుఁడు | విశ్వకేతువు,ఋశ్యకేతుఁడు,ఋశ్యకేతువు | అనిరుద్ధుఁడు |
| విశ్వబల | విశ్వల | జిబిలికచెట్టు |
| విశ్వస్పృక్కు | విశ్వస్పృట్టు,విస్వస్పృజుఁడు | లోకముంజేయువాఁడు |
| విషయము | విశయము | నిత్యముగనుండుచోటు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| వెనుకంజవేయు | వెనుకదీయు, వెనుదీయు, వెనుకద్రొక్కు, వెన్నిచ్చు | లోఁబడు |
| వెనుకొను | వెనుచేయుచు, వెనుతవులు, వెనుదన్ను, వెన్నుదన్ను, వెన్తవులు, వెన్నంటు, వెన్నొక్కను, వెన్నడించు, వెన్నడికొను, వెన్నాడు | వెంబడించు |
| వెనుబడు | వెన్బడు | దుఃఖపడు |
| వెరవు | వెఱవు | జీవనోపాయము |
| వెఱ | వెఱఁగు, వెఱపు, వేఁగు | భయము, ఆశ్చర్యము |
| వెలగ | వెల్గ | కపిత్థము |
| వెలఁది | వెలఁదుక | ఆఁడుది |
| వెలి | వెలపల, వెలపట | బయలు |
| వెలి | వెల్లి, వెల్లన | తెల్లన |
| వెలిచియ | వెలిచె, వెల్చె | ఒకపక్షి |
| వెలిదమ్మి | వెల్లదమ్మి | తెల్లతామర |
| వెలిపము | వలిపము, వల్పము | స్వచ్ఛమైనది |
| వెలుపలించు | వెలుపించు, వెలిపుచు, వెల్వరించు | బయటఁబెట్టు |
| వెలువడుట | వెల్వడుట, వెడలుట | వెడలుట |
| వెలువరించు | వెలుపరచు, వెల్వరించు | బయలు గాఁ జేయు |
| వెలుతురు | వెలుతురు | ఒకచెట్టు |
| వెల్లి | వెల్లువ | అనేకప్రవాహము |
| వే | వేగ, వేగిరము, వేగపాటు, వేగిరపాటు | వేగము |
| వేగరి | వేగురి, వేగు, వేగులవాఁడు, వేగువాఁడు | చారుఁడు |
| వేఁగి | వేఁగిస | ఒకచెట్టు |
| వేఁగు | వేవు | తెల్లవాఱు |
| వేగుసు | వేవుసు | వేయిమంది |
| వేటు | వేఁత, ప్రేటు, ప్రేఁత | ప్రేయుట |
| వేఁడిమి | వేఁడి, వేండ్రము | వెచ్చన |
| వేడుక | వేడ్క | సంతోషము |
| వేదన | వేదనము | పరితాపము |
| వేది | వేదిక | ఔపాసనాదులయిరుగు |
| వేనవేలు | వేవేలు | వెయ్యివేలు |
| వేఁపు | వేఁపుడు, ప్రేఁపు, ప్రేఁపుడు | వేయించుట |
| వేమ | వేమము | సాలెవాని నేఁతపలక |
| వేమాఱు | వేమారు, వేసాఱు, వేమరు | పలుమాఱు |
| వేయి | వెయ్యి, వే, వెయి | సహస్రము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| వేగము | వేగమి, వేగిన్పాటు, వేఱుపాటు | వైరము |
| వేర్పాటు | వేఱుపాటు, వేటిమి, వేఱు, వేఱడము, వేఱుబందము | భేదము |
| వేల్లితము | వల్లితము | ఒకగుఱ్ఱపుగదను |
| వేశము | వేషము | భూషణాదులు అలంకరిం |
| వేశవారము | వేసవారము, వేసవారు | సంబారు [చుకొనుట |
| వేసంగి | వేసవి | ఎండకాలము |
| వేసడ | వేసడము | ఒకదేశ [పూలదండ |
| వైకక్షకము | వైకక్ష్యకము | జందెము వలె వేసికొను |
| వైణుకము | వేణుకము | ఏనుఁగును శిక్షించు కోల |
| వైదగ్ధి | వైదగ్ధ్యము | విదగ్ధునిధర్మము |
| వైదూర్యము | వైడూర్యము | ఒకరత్నము |
| వైదుష్యము | వైదుషి | పాండిత్యము |
| వైశ్రవణుఁడు | వైశ్రవణుఁడు | కుబేరుఁడు |
| వ్యత్యయము | వ్యత్యాసము | తారుమారగుట |
| వ్యధము | వేధము | చిల్లిపొడుచుట |
| వ్యలము | వ్యళీకము | కపటము |
| వ్యాకోచము | వ్యాకోశము | వికసించినది |
| వ్యామము | వ్యాయామము | బార |
| వ్యాళము | వ్యాడము | పాము, పులి |
| వ్యాళగ్రాహి | వ్యాళగ్రాహుఁడు | పాములవాఁడు |
| వ్యాళాయుధము | వ్యాడాయుధము | పులిగోరు |
| వ్యాసపీఠము | వ్యాసపీఠము | వ్యాసపీఠిక |
| వ్యుష్టి | వ్యుష్టము | కార్యసిద్ధి, ఫలము |
| వ్యోమకేశి | వ్యోమకేశుఁడు | శివుఁడు |
| వ్రయ్య | వ్రక్క, వ్రచ్చు, వ్రయ్యబడు | తునుక |
| వ్రాయి | వ్రాఁత | లిపి |
| వ్రీడము | వ్రీడ | సిగ్గు, వ్యభిచారము |
| వ్రీడు | వ్రీడె | జాఱుట |
| వ్రేఁకము | వ్రేకన, వ్రేక | బరువు |
| వ్రేత | వ్రే | గోపిక |
| వ్రేలంబడు | వ్రేలాడు | ఆందోళనముచేయు |
| వ్రేలుమిడి | వ్రేల్మిడి | చిటిక |

## శ

| | | |
|---|---|---|
| శండుఁడు | షండుఁడు, సండుఁడు, పండుఁడు | నపుంసకుఁడు |
| శంప | సంప | మెఱుపు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| శంబము | సంబము | వజ్రాయుధము |
| శంబరము | సంబరము | జలము |
| శంబరి | సంబరి | ఎలికెచెవిచెట్టు |
| శంబలము | సంబలము | దారిబత్తెము |
| శంబలి | శంఖలి, సంఖలి | తాపికత్తె |
| శంబాకృతము | సంబాకృతము | రెండుచాళ్లుదున్నిన [భూమి |
| శంబూకము | శంబూకము, శాంబుకము, శంబుకవు | గుల్ల |
| శంయు | శంయువు, శయువు | కొండచిలువ |
| శకటము | శకటి | బండి |
| శకలము | శాకలము | తునుక |
| శకులము | శకులము, శకులి, శల్కి | చేఁప |
| శకునము | శకుని, శకుంతి, శకుంతము, శుకుంతము | పక్షి |
| శక్వరము | శాక్వరము | ఎద్దు |
| శణఖములు | చణకములు | సెనగలు |
| శణపరి | ఆసనపర్ణి | నేలమునగపుంజెట్టు |
| శతద్రువు | శతద్రి | ఒకనది |
| శతభిష | శతభిషము, శతభిషక్కు | ఒకనక్షత్రము |
| శమము | శాంతి | కామాదులులేకుండుట |
| శమి | శమీరము | చిన్నజమ్మిచెట్టు |
| శమ్యాకము | శంపాకము, సంపాకము | రేలచెట్టు |
| శయము | శయ్య | పడక, పానుపు |
| శరత్తు | శరద, శారద | శరదృతువు |
| శరభము | శలభము | మిడుత |
| శరయువు | సరయువు | ఒకనది |
| శరవము | శరావము | మూఁకుడు |
| శరవుఁడు | శర్వుఁడు | శివుఁడు |
| శరాసము | శరావాసము, శరాసనము | విల్లు |
| శర్కర | శర్కరము, శర్కరిలము, శర్కరావంతము, శార్కరము, శార్కరిలము | మెఱుగిసుక, ఈయిసుకగలనేల |
| శర్వము | సర్వము | సకలము, విశ్వము |
| శర్వ | శర్వాణి | పార్వతి |
| శర్వర | శర్వరి | రాత్రి |
| శలము | శలలము, శలలి | ఏదుపందిముల్లు |
| శల్కము | శకలము | తునుక |
| శవము | శపము, శ[illegible]ము | పీనుఁగు |
| శసనము | శమనము | యజ్ఞమందలిపశువధ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| శాంతము | [illegible] | శమించినరోగాదులు |
| శాటి | [illegible] | సన్న్యాసులబట్ట, దుప్పటి |
| శాడ్వలము | శాడ్వలము | లేంతగడ్డిగలబీడు |
| శాణము | శాణ | సాన |
| శాతము | సాతము | సంతసము |
| శాబరము | సాబరము | లొద్దుగచెట్టు |
| శాగరి | శాగరము | ఏడాకులయరంటిచెట్టు |
| శారిపత్త్రికము | శారిపత్త్రిక | శరపత్త్రినిధర్మము |
| శాలగ్రామము | సాలగ్రా[illegible] | ముద్యాకుపాన్ను |
| శాలము | సాలము | గృహము [దుంప |
| శాలాపాకము | సాలాపాకము | కలువ మొదలగువాని |
| శాలూరము | సాలూరము | కప్ప |
| శాల్మలి | శల్మలి | బూరుగుచెట్టు |
| శింబ | సింబ, శింబి, సింబి | కందిపొట్టు మొదలగునవి |
| శింశుప | శింశప | ఇరుగుడుమాను |
| శింశుమారము | శిశుమారము | మొసలి |
| శిఖరము | శేఖరము | సిగరము |
| శిబిక | శివిక | పల్లకి |
| శిబి | శివి | ఒకరాజు, చెట్టు |
| శిరము | శిరసు, శిరస్సు, శీర్షము | తల |
| శిగము | సిగము | పిప్పలిదుంప |
| శిర | సిర | బోలునరము |
| శిలోంఛము | ఉంఛశిలము | ఒకవృత్తి |
| శిశుత్వము | శైశవము | చిన్నతనము |
| శీతము | శీతలము | చల్లనివస్తువు |
| శీతల | శీతలము | సోమిదపుఁజెట్టు |
| శీతశివము | సీతసివము | సైంధవలవణము [భార్య |
| శీత | సీత | నాఁగటిచాలు, రాముని |
| శీర్షకము | శీర్షణ్యము | కిరీటము |
| శుండ | శుండము, శుండాలము | ఏనుఁగుతొండము |
| శుభాంగి | శుభాంగి | రతీదేవి |
| శుక్రుఁడు | శుక్లుఁడు | భార్గవుఁడు |
| శుభ్రాంశుఁడు | శుభ్రాంశుఁడు, శుభ్రిమాంశుఁడు | చంద్రుఁడు |
| శుభ్రదంతి | శుభ్రదతి, సుదంతి | వాయుదిగ్గజము భార్య |
| శుల్బము | సుల్బము | త్రాడు |
| శూకరము | సూకరము | అడవి పంది |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| శూరకల్పుఁడు | శూరదేశ్యుఁడు, శూరదేశీయుఁడు | శూరసముఁడు |
| శూరుఁడు | సూరుఁడు | సూర్యుఁడు, పండితుఁడు |
| శూర్పము | సూర్పము | చేట |
| శృంఖలము | శృంఖలి | సంకెల |
| శృంగాలము | శృగాలము, సృగాలము | నక్క |
| శృంగికనకము | శృంగికనకము, శృంగి | సొమ్ముచేసినబంగారము |
| శేలువు | శైలము | విరిగిచెట్టు |
| శేవధి | సేవధి | నిధి |
| శేవము | శేభము, శేఫము, శేపము, శేఫస్సు | మగవాని మర్మాంగము |
| శైలి | శైల్యము | శిలాస్వభావకర్మము |
| శైవలి | శైవలము, శైవాలము, శేవాలము, శివాలము | నాఁచు |
| శోకము | శుక్క | ఏడుపు |
| శోణకము | శోనకము, స్యోనాకము | దుండిగపుమ్రాను |
| శోణి | శోణము | ఎఱ్ఱని |
| శోథము | శోసము | వాపురోగము |
| శోభాంజనము | సోభాంజనము | మునగచెట్టు |
| శోషణము | శోషము | శోషి ంచుట |
| శాష్కులుఁడు | శాష్కులుఁడు | మాంసముఁదినువాఁడు |
| శ్యామము | శ్యామలము | చామనచాయ |
| శ్యామకములు | శ్యామాకములు | చామలు [వాఁడు |
| శ్యాలుఁడు | శ్యాలకుఁడు, స్యాలుఁడు, స్యాలకుఁడు | పెండ్లముతోఁ బుట్టిన |
| శ్యావము | శావము | కపిలవర్ణము |
| శ్రద్ధావంతుఁడు | శ్రద్ధాళువు, శ్రద్ధాళుఁడు, శ్రద్ధ ధాళువు, శ్రద్ధధాళుఁడు | ఆసక్తిగలవాఁడు |
| శ్రాంతి | శ్రాంతుఁడు | అలసినవాఁడు |
| శ్రీమము | శ్రమము | అలసట |
| శ్రాయము | శ్రయణము | ఆశ్రయింపు |
| శ్రావణము | శ్రావణికము | ఒకమాసము [వాఁడు |
| శ్రితుఁడు | ఆశ్రితుఁడు | ఆశ్రయించియున్న |
| శ్రియఃపతి | శ్రీపతి | విష్ణువు |
| శ్రీలుఁడు | శ్లీలుఁడు | సంపదగలవాఁడు |
| శ్రేయసి | చేతకి | కరకచెట్టు |
| శ్రోతము | శ్రుతి | చెవి |
| శ్లక్ష్ణుఁడు | శక్ష్ణుఁడు | ప్రియముపల్కువాఁడు |
| శ్లేష్మణుఁడు | శ్లేష్మలుఁడు | శ్లేష్మరోగము గల |
| శ్వాగణికుఁడు | శ్వాగణికుఁడు | బోయవాఁడు [వాఁడు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| శ్వసము | శ్వాసము | ఊర్పు |
| శ్వేతము | శ్వైతము | తెలుపువన్నె |
| ష్ఠీవనము | ష్ఠీవనము | ఉమియుట |

## స

| | | |
|---|---|---|
| సంకరము | సాంకర్యము | సంకరజాతి |
| సంకెల | సంకిలియ,సంకలియ | శృంఖలి |
| సంఖ్యము | సఖ్యము | చెలిమి |
| సంగడి | సంగడము,సంగాతము | చెలిమి |
| సంగడీఁడు | సంగడికాఁడు,సంగాడి,సంగాతి,సంగాతకాఁడు | హితుఁడు |
| సంగము | సంగమము | కూడిక |
| సంఘాతము | సంహారము | ఒకనరకము |
| సంచేకరువు | సంచేకారము,సంచికరువు,సంచేకరము | పెట్టుబడిసొమ్ము |
| సంజె | సంద,సందె,సందెజోము | సంధ్య |
| సంజ్ఞుఁడు | సంజ్ఞువు | ముడిమోకాళ్ళుగలవాఁడు |
| సంతతము | సతతము | ఎల్లప్పుడు |
| సంతాపితము | సంతప్తము | తపింపఁజేయఁబడినది |
| సంతోషము | సంతోసము,సంతసము | ఆనందము |
| సందంశము | సందంశి | కమ్మరికారు |
| సందడిగొను | సందడిపడు,సందడిల్లు,సందడించు | సందడిచేయు |
| సందావము | సంద్రావము | పారిపోవుట |
| సందితము | సంధితము,సంధానితము | కూర్చినది,కట్టినది |
| సంధ | సంధ్య | సంజపొద్దు |
| సంధ్య | సంధి | చేరిక |
| సంపంగి | సంపెఁగ,సంపెంగ,సంపఁగియ, సంపఁగె,సంపెఁగి,చెంపకము | చంపకము |
| సంపత్తు | సంపత్తి | సంపద |
| సంపరాయికము | సాంపరాయికము | యుద్ధము |
| సంబళము | సంబడము,సంబళిక | జీతము |
| సంబారము | సంబారువు,సంబారు | తిరగమోఁతవస్తువులపొడి |
| సంబాళిగలు | సమ్మాళిగలు,సంబవులు | పావకోళ్లు |
| సంబెళ | సమ్మెళ,సమ్మెట,సంపెట | కొయ్యసుత్తె |
| సంయమము | సంయామము | చాలించుట,తపస్సు |
| సంవననము | సంవదనము | మణిమంత్రాదులచేవశపఱచుకొనుట |
| సంవర్తిక | సంవృత్తిక | క్రొత్తతామరరేకు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| సంవేధము | వేదన | సుఖదుఃఖానుభవము |
| సంశప్తకులు | సంసప్తకులు | శపథముచేసియుద్ధము నమరలనివారు |
| సంపారము | సంసరము, సంశరము | సంసారము |
| సంస్త్యాయము | సంస్త్యాయము | ఇల్లు |
| సంస్ఫేటి | సంస్ఫోటము | యుద్ధము[ ప్రమొక్కుట |
| సంహాతలము | సింహాతలము | రెండుచేతులు జోడించి |
| సకి | సకియ | చెలికత్తె |
| సకిలింత | సకిలింపు, సకిరింత, సగిలింత | హేషారవము |
| సగము | సవము, సాము, సాబాలు, సావాలు | అర్ధభాగము |
| సగ్గారి | సగ్గాలము | నక్క |
| సగ్ధి | సజగ్ధి | పొత్తునదినుట |
| సట | జట | జడ [వాని మెడజూలు |
| సట | సటి | గుఱ్ఱములు మొదలగు |
| సడికియ | సడికియ్య, సడికె | కుక్కమెడ త్రాడు |
| సణసూత్రము | శణసూత్రము | వలత్రాడు |
| సత | సత్తా | ఏడు |
| సతీనకము | సతీలకము | లంకభూమి |
| సత్తి | సత్తువ | శక్తి |
| సత్యాపనము | సత్యంకారము, సత్యాకృతి | సంచకారము |
| సదము | సదస్సు | సభ |
| సదస్సు | సదనము | ఇల్లు |
| సదాతనము | సనాతనము | నాశము లేకుండునది |
| సదృక్కు | సదృశము, సదృక్షము | సమానము |
| సదేశము | సవేశము | సమీపము |
| సనెకలు | సన్నికల్లు, సనె, సన్నె, సన్నెకల్లు, సన్నెగల్లు | నూఱెడుబాయి |
| సన్నాయ్యము | సాన్నాయ్యము | పెరుగుపాలతోఁజేసిన హవిస్సు |
| సపము | సబము, సబరము | పీనుఁగు |
| సప్తాశ్వుఁడు | సప్తశ్వుఁడు | సూర్యుఁడు, బ్రహ్మ[ము |
| సబడి | సబళి, సబరి, సబళము, సబిడి, సబిడీ | సబిలము నెడియాయుధ |
| సమకులు | సమకూరు, సమకూడు, సమకొను | జతపడు |
| సమజ్ఞ | సమాజ్ఞ, సమాఖ్య | కీర్తి |
| సమరత | సమర్త | క్రొత్తముట్టు |
| సమికము | సమీకము | కయ్యము |
| సమితి | సమిత్తు | యుద్ధము [దలగునవి |
| సముత్పింజము | పింజలము | మిక్కిలికలిగిన సేనమొ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| సముదయము | సముదాయము,సమవాయము | గుంపు |
| సమూరువు | చమూరువు | ఒకజాతియిఱ్ఱి |
| సమృద్ధుఁడు | సమర్థుఁడు,సమృద్ధి | మంచిసంపదగలవాఁడు |
| సమ్మియ | సమ్మె,సముతు | సంఘపుఁగట్టుబాటు |
| సయ్యాట | సయ్యాటము,సయాటము,సయ్యాట,సయాట | పరేచికము |
| సరములు | సరులు | దండలు |
| సరస్సు | సారము | నీరు |
| సరసి | సరస్సు | కొలఁకు |
| సరిపెన | సరిపెణ,సరపణి,సరిపణి | గొలుసు |
| సరీషపములు | సర్షపములు | ఆవాలు |
| సర్జరసము | సర్వరసము | సజ్జరసము |
| సర్పి | సర్పిస్సు | నేయి |
| సర్వాల | శర్వాల | చిన్నకోల |
| సలగ | సలుగ,సలువ | కొమ్ము |
| సలగ | సలవ | పాలచిప్ప |
| సలి | సలిలము,సలీలము | ఉదకము |
| సలుపరింత | సలుపరింత,సలుపు | పోటుబాధ |
| సల్లకము | సల్లకి | అందుగుచెట్టు |
| సవ | సవడి,సవ్వడి,సడి,సొవ | ఆచూకి |
| సవతి | సవతాలు | తోడిపెండ్లాము |
| సవి | సస్సము,సస్సియము | పైరు |
| సస్యము | శస్యము | వృక్షాదులఫలము |
| సవ్యేష్ట | సవ్యేష్టుఁడు,సవ్యేష్ఠుఁడు | సారధి [రింట |
| సహచరము | సహాచరము,సహచరి | పచ్చపూవులములు గో |
| సహదేవి | సహాదేవి | ముత్తువపులగపుఁజెట్టు |
| సహస్రము | సాహస్రిము | వెయ్యి [వాఁడు |
| సహిష్ణుఁడు | సహిష్ణువు,సహనుఁడు | సహజమైనయోర్పుగల |
| సాకి | సాకిరి,సాక | సాక్షి |
| సాటి | సాటిక,సాటువ | సాదృశ్యము |
| సాదము | సాదనము | పరిశుద్ధము |
| సాపడు | పసాదపడు | భుజియించు |
| సాబాలు | సావాలు | సమాంశము |
| సామగ్రి | సామగ్ర్యము | సమగ్రభావము |
| సామిత | సామెత | లోకోక్తి |
| సాయిల | సావలి,సావలీఁడు | బుడబుడక్కలవాఁడు |
| సారంగము | శారంగము | వానకోయిల,తుమ్మెద, లేఁడి,ఏనుఁగు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| సారణ | ప్రసారణ, సారిణి | గొంతెమగోరుచెట్టు |
| సారసన | సారసనము | కవచముపైఁగట్టుకొను త్రాడు |
| సారా | సారాయి | కల్లు కాఁచినరసము |
| సాలవృకము | సాలావృకము | కోఁతి, కుక్క, నక్క తోఁడేలు |
| సాలియ | సాలె, సాలీఁడు, సాలెవాఁడు | బట్టలు నేయువాఁడు |
| సాలువము | సాళువము, సాళ్వము | డేగ |
| సాహస్రి | సాహస్రిఁడు | వేయింటికధిపతి |
| సాహితి | సాహిత్యము | కలశబ్దార్థజ్ఞానము |
| సాహిణి | సాని | గుఱ్ఱపురౌతు |
| సింగాణి | సింగిణి, సింగిణీ | ఒకవిల్లు, విల్లు |
| సింజ | శింజ, సింజితము | మంజులధ్వని |
| సిందుకము | సిందువారము, సిందువారకము | వావిలిచెట్టు |
| సిందూరము | సిందురము, సింధురము, సింధూరము | చెందిరము |
| సింధుకము | సింధురము | ఏనుఁగు |
| సింహాణము | సింఘాణము | చీమిడి, చిట్టము |
| సింహి | సింహ | రాహువుతల్లి |
| సికత | సికతావతము, సైకతము, సైకతిలము | ఇసుకగలభూమి |
| సిగ | సిక | జుట్టు |
| సిగము | సివము | అమ్మవారుపూనుట |
| సిగరము | సిగము | శృంగము |
| సితాభము, | సితాభ్రము | కర్పూరము |
| సిద్ధము | సిద్ధ్యము | పుష్యమీనక్షత్రము |
| సిధ్మ | సిధ్మము | సిబ్బెమనురోగము |
| సిబ్బితి | సిబ్బెత | సిగ్గు |
| సిబ్బెము | సిబ్బియము, సోబియ, సోబె | పొడ |
| సిరము | సిరసు | తల |
| సిల | సెల | నీరుపుట్టుతావు |
| సిలాజితు | సిలాజిత్తు | శిలాజతు |
| సివఁగి | సివ్వఁగి, చివఁగి, చివ్వఁగి | తరక్షువు |
| సీతు | సీతువు | చలికాలము |
| సీమ | సీమము | పొలిమేర |
| సీవిర్లు | సీవురులు | చామరములు |
| సుంకరి | సుంకరీఁడు, సుంకీఁడు | పన్నుగొనువాఁడు |
| సుకము | సుగము | సుఖము |
| సుకర | సూకర | సాఁగవగునావు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| సుకేని | సుకని, సు[illegible] | ఒకభక్ష్యము |
| సుత్రాముఁడు | సూత్రాముఁడు | ఇంద్రుఁడు |
| సుధర్మ | [illegible] | దేవసభ |
| సునాసీరుఁడు | సు[illegible] | ఇంద్రుఁడు |
| సుప్పనాక | [illegible] | శూర్పణఖ |
| సుప్రాశి | సుప్రాశి, [illegible] | మంచిముత్యము |
| సుమము | [illegible] | పూవు |
| సుమేరువు | మేరువు | బంగారుకొండ |
| సుర | సురి, సురియ, సురె, సూరకత్తి, సూరకత్తి, చుర, చురి, చురియ, చురకత్తి, చూరకత్తి, చూర, చూరి, చూరె | చిన్నకత్తి |
| సురటి | సురటీ | గుండ్రనివిసనకఱ్ఱ |
| సురద్విట్టు | సురద్విషుఁడు | రాక్షసుఁడు |
| సురి | సుర | సారాకల్లు |
| సువర్చల | [illegible] | బ్రాహ్మీచెట్టు |
| సువర్ణము | స్వర్ణము | బంగారము |
| సుషవి | సుశవి | నల్లజీలకఱ్ఱ |
| సుషి | సుషిరము, సు[illegible] | రంధ్రము |
| సుషిమము | సుశిమము | నల్లనివస్తువు |
| సుషిర | సుశిర | ఒకగంధద్రవ్యము [ము |
| సుషిరము | శుషిరము | వేణుశంఖకాహళాదిక |
| సూచి | సూచి, సూచిక, సూచిని | సూది |
| సూడిద | సూడిదె | కానుక |
| సూతికాగృహము | సూతకాగృహము | పురిటిల్లు |
| సూనము | ప్రసూనము | పూవు |
| సూనరి | సూనగాఁడు | కటికవాఁడు |
| సూరెపాను | సూరెపాన్పు | ఆలవట్టము |
| సృక్వము | సృక్వి | పెదవి |
| సృణిక | సృణీక | నోటిచొంగ |
| సెగ | సెవ, సెక | జ్వాల, వెట్ట |
| సెగము | సెగ్గింపు, సెగ్గు, సెగ్గెము | రోఁత |
| సెబ్బర | సెబ్ర | చెడుగు |
| సెబాసు | సేబాసు, సబాసు | బళి |
| సెలగ | సలుగ, సలువ | కొలగుంటు |
| సేవనము | సీవనము | బట్టలుకుట్టుట |
| సేవ | సేవనము | ఊడిగము |
| సేవ | సేవియ, సేవె | ఒకభక్ష్యము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| సైనికము | సైన్యము | సేనలోఁ గూడియుండు |
| సైపుడు | సైపు, సైరణ, సయిపుడు, సయిపు, సయిరణ | శాంతి [బలము |
| సొంతము | సొంతతరము | స్వతంత్రము |
| సొగపు | సొగయిక | పరవశత్వము |
| సొగయు | సొగియు | సుఖపడు |
| సొన్న | సొన్నము, సొన్నా, హొన్న | బంగారము |
| సొమ్మగోను | సొమ్మసిలు, సొమ్మవోవు | మూర్ఛనొందు |
| సొరంగము | సురంగము, సొరంగ, సురంగ | కంత |
| సొరగు | సొరుగు, సొలగు, సొలపు, సొలిమిడి | మూర్ఛ |
| సొరి | సొరియు | రంధ్రము |
| సొల | సొగ, సొల్ల | ఆనుగ |
| సోగ | సోవ | అవోక |
| సోదరులు | సోదర్యులు | అన్నదమ్ములు |
| సోదియు | సోదె | వింత, సోది |
| సోదెము | సోద్దెము | వింత [వాఁడు |
| సోన్మదుఁడు | సోన్మాదుఁడు | మత్తెక్కి మేనెఱుఁగని |
| సోపు | సోబు, సోబె, సోబిగు | వాపురోగము |
| సోమపీతి | సోమపీథి, సోమపీవి | సోమయాజి |
| సోమము | సోమ | కార్యము |
| సోమించు | సామించు | సమమగు |
| సోమిదమ | సోమిసాని | సోమిదేవి |
| సోరణ | సోరణగండ్లు, సోరణగండె, సోరణము సోర్ణగండ్లు | ఒకకిటికీ |
| సోలి | సోలుపు | జారు |
| సౌకర్యము | సుకరము | సులువు |
| సౌదామని | సౌదామిని, సౌదామిన్న | మెఱుపు |
| సౌరుఁడు | సౌరి | శని [ఖోజ్జా |
| సౌవిదుఁడు | సౌవిదల్లుఁడు, సంవిదల్లుఁడు | అంతిపురికావలివాఁడు |
| సౌహృదము | సౌహృదయము, సౌహార్దము, సౌహార్ద్యము | మైత్రి |
| స్కందస్సు | స్కందము, స్కంధము | భుజశిఖరము |
| స్తంబఘ్నము | స్తంబఘునము, స్తంబహాన | గుద్దలి |
| స్తవము | స్తవనము | స్తుతి |
| స్తేయము | స్తైన్యము | దొంగతనము |
| స్తోకము | స్తోకకము | వానకోయిల |
| స్థలము | స్థలి | నిర్జలప్రదేశము |
| స్థాండిలుఁడు | స్థండిలశాయి | వ్రతముచేత భూమి మీఁ దఁబరుండువాఁడు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| స్థిరతరము | స్థేయము | చిరకాలముండునది |
| స్థూరి | స్థౌరి | మోపుమోయు గుఱ్ఱము |
| స్నవము | స్రవము, స్రావము | కురియుట, చిల్లిగుండఁ |
| స్నుహా | స్నుహి | జెముడుచెట్టు [గారుట |
| స్పరిశము | స్పర్శము | వాయువు, వాయుగుణ |
| స్పర్శుఁడు | స్పృశుఁడు | వేగులవాఁడు [ము |
| స్పృక్క | పృక్క | ఒకగ్రంధ్యము |
| స్పృష్టి | స్ప్రిష్ట | ఒకరోగము |
| స్పృష్టి | పృష్టి | ముట్టుట |
| స్ఫట | స్ఫోట | పడగ |
| స్ఫటికము | స్ఫాటికము | పటికము, పలుగురాయి |
| స్ఫురణము | స్ఫురణము | అదరుట |
| స్ఫిచము | స్ఫిజము | పిరుదులందెత్తుతావు |
| స్ఫీతము | స్ఫీగము | అధికమయినది |
| స్యూతము | స్యోతము | పళ్ళిక |
| స్యూతి | సూతి | బట్టకుట్టుట |
| స్రవ | స్రువ | చాగచెట్టు |
| స్రవణము | స్రావణము | కారుట [వి |
| స్రుతము | స్నుతము | కారిననీళ్ళు మొదలైన |
| స్రువావృక్షము | స్రుగావృక్షము | పుల్లవెలఁగచెట్టు |
| స్వనము | స్వానము | ధ్వని |
| స్వపనము | స్వాపనము, స్వప్నము, స్వాపము | కల, నిద్ర |
| స్వయంభువు | స్వభువు, స్వర్భువు | బ్రహ్మ |
| స్వవాసిని | సువాసిని | ముత్తైదువ |

## హ

| | | |
|---|---|---|
| హంజిక | భంజిక | భారంగి, చిఱుతేకు |
| హజారము | హజాఱము, హాజారము, అజారము, హజారు | కొలువుకూటము |
| హడపము | అడపము | వక్కలాకులసంచి, మం |
| హత్తి | అత్తి | ఏనుఁగు [గలిపొది |
| హత్తు | అత్తు | మైనపుగుడ్డ |
| హనుమ | హనుమంతుఁడు, అనుమంతుఁడు | ఆంజనేయుఁడు |
| హాయనము | హాయనము | ఏఁడాది |
| హరసము | అరసము | సంతోషము |
| హరితము | హారితము, హరిత్తు, హరి | ఆకుపచ్చ |
| హరితాలము | హరీతాళము | అరిదళము |
| హరిదళము | అరిదళము | హరితాళము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| హారిద్రము | హారిద్రువు | పసపు |
| హారుసము | అరసము | సంతోషము |
| హార్మి | హార్మ్యము | ధనవంతుల మేడ |
| హార్షము | హారషము | సంతోషము |
| హాలము | హోలము | నాగలి |
| హాళది | హాళిది,అడదది,అలిది | పసపు |
| హాసదు | అసదు | అసత్తు |
| హాసము | హాసము,హాసనము,హాస్యము,హాసిక | నవ్వు [టి |
| హస్తధారణము | హస్తధారణము | చంపవచ్చినవానినడ్డు |
| హస్తిపురము | హస్తినపురము,హస్తినాపురము,హస్తినీపురము | ఢిల్లీ |
| హారతి | ఆరతి,ఆర్తి | మంగళహారతి |
| హారము | హారి | ముత్తెములదండ |
| హాలాహలము | హాలాహలము,హాలహాలము,హాలాహలము, హలహాలము, హలాహలము, హాలహలము,హలహలము | విషము |
| హావడి | హావళి | ఉపద్రవము |
| హింగుదము | హింగుది | నేలములకచెట్టు |
| హితవు | ఇతవు,ఇతము | హితము |
| హిమని | హిమాని | మంచుగుంపు |
| హుతాశి | హుతాశుడు,హుతాశనుడు | అగ్ని |
| హుమా | హుమాయి | [illegible] |
| హుహువు | హూహువు | ఒకగంధర్వుడు |
| హుళక్కి | హుళికి,హుళిక్కి,హుళ్లి | అబద్ధము |
| హూతి | సంహూతి | పలువురుపిలుచుట |
| హృది | హృదయము | మనస్సు |
| హృష్టుడు | హృషితుడు | సంతసిల్లినవాడు [డు |
| హెగ్గడి | హెగ్గడికాడు, హెగ్గడివాడు, హెగ్గడీడు | అంతఃపురపరిచారకు |
| హెచ్చెరిలు | హెచ్చరిల్లు, హెచ్చలు, హెచ్చిలు | వృద్ధిపొందు |
| హేష | హ్రేష | గుఱ్ఱపుసకిలింత |
| హోంతకాడు | హోంతకారి | జగజెట్టి |
| హౌసు | హవుసు,ఔసు,అవుసు | ఒయ్యారము [పు,ఏలు |
| హ్రిదిని | హ్రదుని | వజ్రాయుధము, మెఱుపు |
| హ్రీణుడు | హ్రీతుడు | సిగ్గుపడినవాడు |
| హ్రీబేరము | హరిబేరము | కురువేరు |

సంపూర్ణము.

# విశేషరూపదర్శిక.

(దీపికానుబంధము.)



| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| | **అ** | |
| అంకపొంకములు | అంకపొంకాలు, అంకాపొంకములు, అంకాపొంకాలు | శీఘ్రము |
| అంగి | అంగీ, అంగరక | నిలువుచొక్కా |
| అంచె | అంచు, అంజె, అండ, అందిక, అందికోలు అందుపాటు | దగ్గర |
| అంచు | అనుచు, అంపు, అనుపు, అంపించు, అన్చు అన్పు | పంపించు |
| అంజె | అంజె, అజ్జ, హంజె, హజ్జ | అడుగు |
| అంజలి | అంజలికి | దోసిలి |
| అంటుకత్తియ | అంటుకత్తె, నంటుకత్తె, ననుపుకత్తె | ప్రియురాలు |
| అంతియ | అంతె, అంతే, అంతవట్టు | అంతమాత్రమె |
| అంప | అంపకోల, అంపఱ, అంబు, అమ్ము | బాణము |
| అంబారము | అంబారు | ధాన్యపురాశి |
| అకట | అకటకట, అకటకటా, అకటా, అక్కట అక్కటకట, అక్కటకటా, అక్కటక్కటా, అక్కటా | అయ్యో |
| అకటవికటము | అకటావికటము | అల్లకల్లోలము |
| అకో | అకో, ఒకొ, ఒకో, ఒకొక్క, ఒకోక్క, ఓ | అవునేమో |
| అగచాట్లపోతు | అగచాట్లమారి, అగసాట్లమారి | కడగండ్లమారి |
| అగడు | అవడు, అవసడి, అవసరి, అవడూరు, అగడారు | అపవాదము |
| అగసాలి | అగసాలె, కంసాల, కంసాలి, కమసాల కమసాలె | స్వర్ణకారుడు |
| అగురు | అవురు, ఔరు | వీరణము |
| అగ్గి | అగిని | అగ్ని |
| అచ్చనగాయలు | అచ్చనగండ్లు, అచ్చనలు | గచ్చకాయలు |
| అచ్చెలము | అంచెలము | కోపము |
| అచ్చిక | అచ్చికము, ఒచ్చెము | న్యూనము |
| అచ్చెరియము | అచ్చెరువు, అచ్చెరుపాటు, అచ్చెరువుపాటు | వింత |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అజారము | హజారము,హజాలము,హాజాలము | మొగసాల |
| అజ్జ | అజ్జార,అజ్జారే,అజ్జా,అజ్జార,అజ్జారే,అజ్ఝా,అజ్ఝారే | సెబాసు |
| అటుక | అటుకె,అట్టుక,అట్టుకు,నట్టుక | అరప |
| అటమట | అటమటము,అటమర | స్వార్థము |
| అటమటీఁడు | అటమటకాఁడు | మోసగాఁడు |
| అటు | అటులన్,అటులు,అట్టు,అట్టులన్,అట్టులు | అలాగు |
| అటువంటి | అట్టి,అటి | అట్లుంటు |
| అట్టివాఁడు | అట్టిఁడు,అట్టిఁడు | తత్సమానుఁడు |
| అడకత్తు | అడకత్తెర,అడకొత్తు,అకొత్తు,పోకత్తు | పోఁకలువత్తునది |
| అడఁకువ | అణఁకువ,అణఁకువ,అణఁగువ | విధేయత |
| అడఁగు | అణఁగు,అడఁగారు,అణఁగారు,అఁగు,అణు | క్రుంగు |
| అడపర | అడ | పిండము |
| అడరించు | అదరుచు,అదర్చు | బాణమేయుట |
| అడిగొంటు | అడిగొట్టు | కుచ్చితుఁడు |
| అడియాలము | అడియాళము | గురుతు |
| అడ్డంకి | అడ్డకట్టు,అడ్డగాలు, అడ్డపాటు, అడ్డపెట్టు అడ్డము,అడ్డవాటు,అడ్డి,అడ్డు,అడ్డుగట్టు | ఆటంకము |
| అడ్డపట్టె | అడ్డపట్టెయు,అడపట్టె,అడ్డమాను | విత్తినపొలమునుసమపడుటకెడ్లనుగట్టితోలునది |
| అతఁడు | అతఁడు, అతగాఁడు,అతగాఁడు | ఆయన |
| అత్తడి | నత్తడి | గోడిగబుఱుతువు |
| అదిర | అదిరా,అద్దిర,అద్దిరా | ఔరా |
| అదురు | అదరు,అదరుగడ,అడలు,అడుకు, అలుకు అళుకు | భయము |
| అదువ | అదవ,అదువు,అద్దియ,అద్దె | బాడిగ |
| అద్ద | అద్దము,అర | సగము |
| అద్దిటి | అద్దిటెయ్యా,అద్దెల | ఓహో |
| అన | అన్న,అప్ప | అగ్రజుఁడు |
| అన్నగరి | అన్నగలి,అన్నగున | నపుంసకుఁడు |
| అన్నన్న | అన్నా,అన్నన్నా | ఆహా |
| అన్ను | అన్నువు | పరవశత్వము |
| అప్పగించు | అప్పనసేయు | వశపఱచు |
| అప్పడము | అప్పళము | ఒకభక్ష్యము |
| అబ్బురము | అబ్బురపాటు, అబ్బురము, అబ్రము అపురూపము | ఆశ్చర్యము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| అల్లుఁడు | అల్లువాఁడు | జామాత |
| అల్లె | అల్లెత్రాడు,అల్లియ | వింటినారి |
| అల్లొనేరెడు | అల్లోనేరేడు | నేరేడు |
| అవతల | అవల,అవ్వల,ఆవల,అవుల,ఔల,అతల | ఆడ |
| అవుజో | అవుదు,ఔజో,ఔదు,ఔదరి | కాలువ |
| అవులెమ్మ | అవులే,ఔలెమ్మ,ఔలే | ఔనానోయీ |
| అసరసంజె | అసరసంజె,అరసంజె | ప్రదోషకాలము |
| అహహా | అహాహో,అహో,అహోర,అహోరే,అహో | ఔరా |

## ఆ

| | | |
|---|---|---|
| ఆఁగడకాఁడు | ఆఁగడీఁడు | దుండగీఁడు |
| ఆగడపలు | ఆడెపలు,ఆడెబలు,ఆడెలు | మబ్బాదొంతరలు |
| ఆఁటది | ఆఁటు, ఆఁడది, ఆఁడుది,ఆఁడుఁకూఁతురు ఆఁడుపుట్టువు | స్త్రీ |
| ఆటువారము | ఆయవారము,ఆయివారము | బిచ్చము |
| ఆడిక | ఆడికోలు,ఆట | అపవాదము |
| ఆణియ | ఆణె,ఆణెము,ఆనియ,ఆనె | దద్దురు |
| ఆణి | ఆణి,ఆను,ఆయము | కిటుకు |
| ఆనుగ | ఆనుగము,ఆనుగు | పొగ |
| ఆపొసనము | అపోసానము | ఆపోశనము |
| ఆమము | ఆవము | కుమ్మరావము |
| ఆయితము | ఆయిత్తము | సన్నాహము |
| ఆరగింత | ఆరగింపు,ఆరోగణము,ఆరోగిణము | భోజనము |
| ఆరటపడు | ఆగటించు, ఆరాటించు | పరితపించు |
| ఆరుగలు | ఆరుకలు,ఆరికెలు | ఆర్లు |
| ఆలి | ఆలు,ఇల్లాలు | పెండ్లము |
| ఆళుగ | ఆళువ | ఒకజాతిపంది |
| ఆళ్వారు | ఆళువారు | హరిభక్తుఁడు |
| ఆవడ | ఆమవడ | ఒకభక్ష్యము |
| ఆవరింత | ఆవలింత,ఆవురింత,ఆవులింత | జృంభణము |
| ఆవాలు | ఆవలు,ఆబలు | ఆవగింజలు |
| ఆవిడ | ఆబిడ,ఆబిడె,ఆయక,ఆకె, ఆయప, ఆపె ఆయమ,ఆమె | ఆ స్త్రీ |
| ఆవిడి | ఆవడి,ఆవరి.ఆవళి | ఉపద్రవము |

## ఇ

| | | |
|---|---|---|
| ఇంగలము | ఇంగిలము | నిప్పు |
| ఇంచుక | ఇంచుకంత,ఇసుమంత | ఒకింత |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఇంట్రము | ఇంటరము | సంకటము |
| ఇంతియు | ఇంతె, ఇంతే, ఇంతవట్టు | ఇంతమాత్రము |
| ఇందనుకట | ఇందాకట, ఇంతవడి | ఇంతవట్టు |
| ఇందువు | ఇఁదుగు | చిల్లగింజ |
| ఇంపు | ఇంబు | ఇష్టము |
| ఇకట్టు | ఇకము, ఇకపాటు | కష్టము |
| ఇగిరించు | { ఇగురుకొను, ఇగురుము, ఇగురొత్తు, ఇగుర్చు ఇగ్రుచు, ఇవిరించు, ఇవురుచు, ఇవుర్చు } | చిగుర్చు |
| ఇగిరిక | ఇగిరికె, నిగిరిక | హావిమ్యము |
| ఇగిలించు | ఇగులుచు, ఇగుల్చు. ఇవులుచు, ఇవుల్చు | పండ్లుబయటఁబెట్టు |
| ఇగ్గు | ఈగు | వెనుకకొఱగు |
| ఇచ్చగొండి | ఇచ్చకుఁడు, ఇచ్చకాలమారి | ప్రియవాది |
| ఇటక | ఇటిక, ఇటికె, ఇటుక, ఇట్టిక, ఇట్టుక | ఇష్టక |
| ఇటు | { ఇటులు, ఇట్టు, ఇట్టులు, ఇట్లు, ఇటువలెఁ ఇట్టువోలెఁ } | ఈలాగు |
| ఇతవరి | హితవరి | హితముచెప్పువాఁడు |
| ఇత్తడి | ఇత్తళి, పిత్తడి, పిత్తళి | పిత్తళము |
| ఇత్తిగ | ఇరుతిగ, ఇర్తిగ | ఆఱు [వనునది |
| ఇదిగో | ఇదిగో, ఇదియ, ఇదె, ఇగో | దాపునంగలదిచూపుము |
| ఇద్దఱు | ఇరుగురు, ఇరువురు, ఇర్వురు | రెండుమంది |
| ఇనుపతేలు | ఎనుపతేలు | నల్లతేలు |
| ఇరవారు | ఇరవుకొను, ఇరవుపడు | పాదుకొను |
| ఇరవు | ఇరవుపట్టు, ఇమ్ము | ఉండుతావు |
| ఇరాఱు | ఈరాఱు | పండ్రెండు |
| ఇరుగు | ఇరువు, పొరుగు | ప్రక్కయిల్లు |
| ఇఱుకు | ఇఱుకాటము, ఇఱుకటము, ఇఱకటము | సంకటస్థలము |
| ఇలకఱచు | ఇల్కఱచు, ఈలకఱచు | బిగఁబట్టు |
| ఇలవరము | { ఇలారము, ఇలువరము, ఇలువారము, నిలువరము. నిలువారము, నిల్వారము } | ప్రస్తుతోపయుక్త కుటీరము |
| ఇలాయి | ఇలాయి, ఇంగిలాయి | ఒకదివిటీ |
| ఇలింద | ఇల్లింద, ఇల్లంద | ఇంద్రవల్లిచెట్టు |
| ఇలు | ఇల్లు, ఇమ్ము, ఇక్క | గృహము |
| ఇలుగు | ఈలుగు, ఈల్గు, నీలుగు, నీల్గు | చచ్చు [ప్రవేశము |
| ఇలునింపుట | ఇలునింపడము, ఇలునింపతము | నూత్న వధూవర గృహ |
| ఇల్లంట్రము | ఇల్లటము, ఇల్లాటము, ఇల్లరికము, ఇల్లఱికము | ఆలిపుట్టినింటఁ జాను్ని |
| ఇల్లవ | ఇల్లెము, ఇల్లెపుచేఁప | ఒకచేఁప |
| ఇసిరో | ఇసీ, ఇస్సిరో, ఇస్సీషసి, ఇసిరో | ఎచ్ఫీ |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| ఇసుక | ఇసుము,ఇసులు,ఉసుక | కఱకుదుమ్ము |
| ఇసుల్లు | ఉసిల్లు,ఉసుళ్ళు | ఱెక్కచెదలు |
| ఇహీహీ | ఈహీ,హిహీ | ఇస్సీ |

## ఈ

| | | |
| --- | --- | --- |
| ఈఁగ | ఈఁగె,ఈవ,ఈవె | మక్షికము |
| ఈగికాఁడు | ఈవరి,ఈవికాఁడు | దాత |
| ఈఁజేటి | ఇంజేటి | ఒకదినుసుకంద [దు |
| ఈడిగిలఁబడు | ఈడిగిల్లు,ఈడ్గిలఁబడు | ముడిచుకొనికూర్చుం |
| ఈఁదాడి | ఈఁదాడు,ఈదు | ఈతచెట్టు |
| ఈన | ఈనియా,ఈనె | ఆకుపారక |
| ఈనిక | ఈఁత | పశువులకాన్పు |
| ఈపి | ఈరు | పేనుగ్రుడ్డు |
| ఈయ | ఇచ్ఛ,ఇచ్చ | అపేక్ష |
| ఈరము | ఈరాలు,ఈఱమి,ఈఱము | పొద |
| ఈరుపెన | ఈర్పెన | లిక్షావికర్షి |

## ఉ

| | | |
| --- | --- | --- |
| ఉంకుడు | ఉంకువ,ఉంకువు | కన్యాశుల్కము |
| ఉంగరము | ఉంగ్రము,అంగుళీయకము | వ్రేలినగ |
| ఉంగడి | ఉంగిడి | పసులతెవులు |
| ఉంగుటము | అంగుటము | పెద్దవ్రేలు |
| ఉంట | ఉండుట | ఉనికి |
| | ఉండ,ఉండ్రము,గుండు,గండ్రము | వర్తుల |
| ఉండ్ర | ఉండ్రెన,ఉండ్రేన | వెలిచండ్రచెట్టు |
| ఉండ్రములు | ఉండ్రాలు | మోదకములు |
| ఉక్క | ఉక్కడీఁడు, ఉక్కరి, ఉక్కుతునియ<br>ఉరియ,ఉటియ | ధైర్యశాలి |
| ఉక్కడఁగు | ఉక్కఱు,ఉక్కుపడఁగు,ఉక్కుచెడు | జడియు |
| ఉగడ | ఉగ్గడు | మరియాద [ల్పు |
| ఉగ్గడింపు | ఉగ్గలింపు,ఉగ్గళింపు | నాట్యమునశబ్దముతో |
| ఉగ్గు | ఉంగ,కంగు | పసిబిడ్డకౌముదమువె |
| ఉచ్చింత | ఉచింత,ఉచ్చింత,ఉచ్చ్రింత | ఉస్తె [ట్టుట |
| ఉజ్జగము | ఉజ్జగింపు,ఉజ్జన,ఉజ్జనము | వదలుట |
| ఉజ్జగొను | ఉజ్జాయించు | ఊహించు, |
| ఉజ్జి | ఉద్ది,ఉద్దియ | సమానము |
| ఉటంకి | ఉటంకు | చొరవగలవాఁడు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఉడిగము | ఊడిగము, ఊడియము, ఊడెము | చాకిరి |
| ఉడుక | ఉడుకుక్క, డుక్క, డుబుడుక్క, డబుడక్క, బుడిబుడుక్క, బుడుబుడుక్క, హుడుక, హుడుకు | ఒక వాద్యము |
| ఉడుము | ఉలుము | తేలుమేపరి |
| ఉడ్డ | ఉడ్డా | కుప్ప |
| ఉదియు | ఉద్దియు, ఉవ్వు | యత్నము |
| ఉద్దనవు | ఉద్దర, ఉద్దరువు, ఉద్దర్వు | తాకట్టు |
| ఉద్దవడి | ఉద్దవిడి | ఉరువడి |
| ఉద్దికాఁడు | ఉద్దుఁడు | జతగాఁడు |
| ఉన్నె | ఉన్నే, ఉండుసే | ఉండునా? |
| ఉపవడము | ఉప్పరడము | మెలఁకువ |
| ఉప్పతిల్లు | ఉప్పొంగు, ఉబ్బతిల్లు, ఉబుకు, ఉబ్బు | ఎక్కువగు |
| ఉప్పరిగ | ఉప్పరిగె | మేడ |
| ఉప్పళము | ఉప్పిలము, ఉప్పవాము, ఉప్పుబట్టి | ఉప్పుకొటారు |
| ఉబుసు | ఊసు | వృత్తాంతము |
| ఉబ్బు | ఉబ్బసము | రొప్పు |
| ఉమక | ఉమ్మక, ఊఁక | వడ్లపొట్టు |
| ఉమాదము | ఉమ్మాగము | పిచ్చి |
| ఉమ్మసము | ఉమ్మలక, ఉమ్మలిక, ఉమ్మలింపు, ఉమ్మ, ఉబ్బ, ఉక్క | ఆవిరి |
| ఉమ్మలి | ఉబ్బలి, ఊబి | బురద |
| ఉరక | ఊరక | మిన్నక |
| ఉరలఁబడు | ఉరలు, ఉర్లఁబడు, ఉర్లు | దొర్లు |
| ఉరవడి | ఉరువడి, ఉఱవడి | వేగము |
| ఉఱ్ఱటలూఁగు | ఉఱ్ఱూఁగు, ఉఱ్ఱూతలూఁగు | మిక్కిలియూఁగు |
| ఉలి | ఉలివు, ఉలివుడు, ఉలుకుడు, ఉరవలి | అలికిడి |
| ఉలుపఁడు | ఉలుపి, ఉల్పడు | శోఫరోగముగలవాఁడు |
| ఉల్లడ | ఉల్లబము, ఉల్లెడ, ఎల్లెడ | మేలుకట్టు |
| ఉల్లము | ఉల్లల | హృదయము |
| ఉవ్విళులూరు | ఉవ్విళ్లూరు, ఉవ్విళ్ళుగొను | తొట్రుపడు |

## ఊ

| | | |
|---|---|---|
| ఊఁకువ | ఊఁకు, ఉవ్వు | యత్నము |
| ఊఁకువగు | ఊఁకు, ఊఁకించు, ఉంకించు | యత్నించు |
| ఊఁగాడు | ఊఁగు, ఊఁగులాడు, ఊవాడు, ఊవు | వ్రేలాడు |
| ఊఁత | ఊఁతు, ఊఁదు | ఒకవల |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఊంద | ఊందు | శోఫ |
| ఊరట | ఊఱట | విరుగుడు |
| ఊసర | ఊసరము | చవిటినేల |

## ఎ

| | | |
|---|---|---|
| ఎంట్రుకాయ | ఎంట్రుక, ఎండ్రకాయ, ఎండ్రి, ఎండ్రిక, నండ్రకాయ | కర్కటకము |
| ఎంబెటికము | ఎంబెటిక, ఎబ్బెరికము, ఎబ్బెటికము, ఎఱబటికము, ఏవ, ఏవము | అసహ్యము |
| ఎకసకియము | ఎకసకెము, ఎకసెకియము, ఎకసెకము, ఎక్కసకియము, ఎక్కసకెము, ఎక్కసెకియము, ఎక్కసెకము | ఎగతాళి |
| ఎక్కటి | ఎక్కటీఁడు, ఒక్కటీఁడు | ఒంటిబంటు |
| ఎక్కిడు | ఎక్కుడుపెట్టు, ఎక్కుపెట్టు, ఎక్కువెట్టు | విల్లుమోపెట్టు |
| ఎగయు | ఎగసిపడు, ఎగసిల్లు, ఎగురు, ఎవయు, సెగయు, సెవయు | పైకిలేచు |
| ఎగుడు | ఎగువ | ఉన్నతము |
| ఎగ్గడ | ఎగ్గడ, ఎక్కడ, ఎన్నడ | ఎందు |
| ఎగ్గలు | ఎగ్గుర్తు | విషయసంగ్రహము |
| ఎచరించు | ఎచ్చరించు, ఎచ్చరికించు, హెచ్చరించు హెచ్చరికించు | ఎచ్చరికచేయు |
| ఎచ్చరము | ఎచ్చరింత, ఎచ్చరింపు, ఎచ్చరిక, హెచ్చరింపు, హెచ్చరిక | అవధానము |
| ఎచ్చు | ఎచ్చిరిలు, ఎచ్చిర్లు, ఎచ్చిలు | వృద్ధియగు |
| ఎటు | ఎటులు, ఎటువలె, ఎట్లు, ఎట్టులు, ఎట్టువోలె, ఎట్లు | ఏలాగు |
| ఎటువంటి | ఎట్టి, ఎట్టు, ఏలాటి | ఎట్లుండు |
| ఎట్టకేని | ఎట్టకునేని, ఎట్టకేలకు | తుదకు |
| ఎట్టు | ఎట్టూ, ఎట్టెట్టూ, ఎట్టెటూరి | ఔరా! ఏమి? |
| ఎడతీయు | ఎడతెగు, ఎడద్రెచ్చు, ఎడపడు | విడఁబడు |
| ఎడతెఱపి | ఎడతెర్పు, ఎడరు | అడ్డము |
| ఎడనీరు | ఎలనీరు, ఎళనీరు | లేతటెంకాయనీరు |
| ఎడయిక | ఎడఁబాటు | వియోగము |
| ఎడారి | ఎడారు, ఎడరు | బయలు |
| ఎడ్డె | ఎడ్డెఁడు, ఎడ్డెవాఁడు | మోటువాఁడు |
| ఎత్తరము | ఎత్తరవు, ఎత్తు | పొడవు |
| ఎత్తు | ఎత్తుగడ, ఎత్తికోలు | యత్నము, వీలు |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఎనఁబది | ఎనుబది, ఎన్బది | ఎనిమిదిపదులు |
| ఎనమండ్రు | ఎనమండ్రుగురు | ఎనిమిదిమంది |
| ఎనమనూఱు | ఎనుమన్నూఱు | ఎనిమిదివందలు |
| ఎనుపసరము | ఎనుపెంటి, ఎనుము, ఎన్ము | గేదె |
| ఎమికె | ఎమ్మె, ఎమ్మెక, ఎముక, ఎఱక | బొమిక |
| ఎఱఁగుడు | ఎఱుఁగుడు | నమస్కారము |
| ఎఱచి | అఱచి | మాంసము |
| ఎఱుకు | ఎఱుక్క | కిరాతుఁడు |
| ఎలమి | ఎలరుపు, ఎలర్పు | సంతోషము |
| ఎలికె | ఎలుక | మూషకము |
| ఎలుఁగు | ఎలుఁగుగొడ్డు, ఎలుఁగుబంటి, ఎలుఁగుమంటి, ఎల్లు, ఎలువు | భల్లూకము |
| ఎల్లిదము | ఎ[illegible]కము | చులకఁదనము |
| ఎవఁడు | ఎ[illegible], ఎ[illegible]ఁడు, ఎవ్వాఁడు, ఏవాఁడు, ఏఁడు | ఏజనుఁడు |
| ఎసఁగు | ఎసపు, ఎ[illegible], ఎసలారు | అతిశయించు |

## ఏ

| | | |
|---|---|---|
| ఏగును | ఏగడము | యాత్ర |
| ఏగురు | ఏవురు | అయిదుగురు |
| ఏట | ఏటము, ఏటవాలు | పక్షపాతము |
| ఏఁడు | ఏఁడాది | సంవత్సరము |
| ఏనిక | ఏనుఁగు, ఏనుంగు, ఏన్గు | గజము |
| ఏనుము | ఏఁదుము | 5 తూములు |
| ఏరుపిడక | ఏర్పిడక, ఏఱుపిడక, ఏఱ్పిడక | పిడుకవంటులు |
| ఏల | ఏలా | ఎందుకు |
| ఏలము | ఏలాము | గవలగుడిసె |
| ఏలుపు | ఏమపు | దుఃఖము |
| ఏలుబడి | ఏల్బడి, ఏమాగడ, ఏడ్గడ | రక్షణము |

## ఒ

| | | |
|---|---|---|
| ఒంటమి | ఒంటరగము, ఒడ్డారము, ఒల్లమి | విరోధము |
| ఒంటరి | ఒంటరికాఁడు, ఒంటరివాఁడు, ఒంటరీఁడు, ఒంటికాఁడు, ఒంట్రింపు | ఏకభటుఁడు |
| ఒంటు | ఒండొరుమిక, ఒందిక, ఒద్దిక, ఒనరిక, ఒనరు, ఒమ్మిక, ఒరిమ, ఒరిమిక | మైత్రి |
| ఒండు | వండు, వండడు | బురద |
| ఒందిలి | ఒంజిలి, ఒత్తడి | దుఃఖము |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఒందు | అందు,పొందు | చెందు |
| ఒకపరి | ఒకపారి,ఒకమరి,ఒకమాఱు | ఒకతడవ |
| ఒగరు | తొగర,తొవర | కషాయము |
| ఒచ్చెల | ఒచ్చెల్ల,ఓచెల,ఓచెల్ల | అయ్యో |
| ఒజ్జ | ఓజ | ఉపాధ్యాయుఁడు |
| ఒడఁగూడు | ఒనగూడు | అమరు |
| ఒడమి | ఒడమె | నగ |
| ఒడయఁడు | ఒడయుఁడు | మగఁడు,రాజు |
| ఒడలిచూపాడయఁడు | ఒడలుచూపాడయఁడు | దేవేంద్రుఁడు |
| ఒడలు | ఒళ్ళు,ఒలము | దేహము |
| ఒడిస | ఒడిసియా,ఒడిసె | పొడుచు బాకు |
| ఒడ్డణము | ఒడ్డాణము.ఒడికట్టు | నడుమునగ |
| | ఒడ్డన,ఒడ్డనము,ఒడ్డము,ఒడ్డు | వ్యూహము |
| ఒడ్డనము | ఒడ్డెమి,ఒడ్డు | పందెము |
| ఒత్తగిల్లు | ఒత్తిలు,ఒత్తిల్లు,ఒత్తు,ఒదిగిలు | ప్రక్కకొఱగు |
| ఒదుగు | ఒదుగుబడి,ఒదువు,ఒద్దియ,ఒద్దె | సమృద్ధి |
| ఒనరించు | ఒనరుచు,ఒనర్చు | చేయు |
| ఒప్పగించు | అప్పగించు,ఒప్పించు,ఒప్పనసేయు,అప్పనసేయు | అధీనపఱచు |
| ఒప్పిదము | ఒప్పు,ఒనగు,ఒఱపు | అందము |
| ఒర | ఒరపిడి,ఒరయిక,ఒఱపిడి,ఒఱయిక,ఒఱియిక | రాపిడి |
| ఒరగు | ఒఱగు,ఓగవోవు,ఒరగఁబడు, ఒరగువోవు ఒఱగఁబడు,ఒఱగువోవు,ఒఱవఁబడు,ఒఱవు,ఓఱగిల్లు | వంగు |
| ఒరగోడ్డెము | వఱగోడ్డము,ఒఱగోడ్డెము,ఒఱగోడ్డియము | కేరడపుఁబలుకు |
| ఒరగోను | ఒరపెట్టు,ఒరయు | రాచు |
| ఒరిమ | ఒరిమిక | ఐకమత్యము |
| ఒఱకటము | ఒఱకాటము,ఒఱగడము,ఒఱగడ్డము | బేసి |
| ఒఱగు | ఒరగు,ఒరుగు, ఒఱగుబిల్ల,ఒఱగుబిళ్ల | తలగడ |
| ఒఱ్ఱి | ఒఱ్ఱు,ఒఱ్ఱన,ఒఱ్ఱఁదనము | కారము |
| ఒఱ్ఱియ | ఒఱవ,ఒఱగు,ఒరగు | ఏటవాలు |
| ఒట్టియ | ఒట్రె,ఆఱవ | పోట్లావు |
| ఒలి | ఒలుపు | అపహారణము |
| ఒలికి | వలికి, ఒలికికాడు, వల్లకాడు, కాడు, ఒలుకులమిట్ట | శ్మశానము |
| ఒలె | ఒల్లియ,ఒల్లె | చీర |
| ఒల్లన | అల్లన, ఒయ్యన, ఓయన | మెల్లగా |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| ఒల్లమి | ఒల్లఁబాటు | కోర్కె లేకుండుట |
| ఒళగు | ఒళవు, పొళవు | వీణాదండము |
| ఒసఁగు | ఒసంగు, ఒసవు | ఇచ్చు |
| ఒసపరి | ఒఱపరి, ఒయ్యారికాఁడు | అందగాఁడు |
| | ఓ ఔ | |
| ఓకర | ఓకరింత, ఓకలింత, ఓకిలి, ఓకిలింత | కక్కుడు |
| ఓగిరము | ఓయిరము, ఓరిము | అన్నము |
| ఓజే | ఓట, ఓటమి | భయము |
| ఓటమి | ఓటము, ఓటు, ఓడు | అపజయము |
| ఓటరు | ఓటాఱు | బలముడిగిపోవు |
| ఓపిక | ఓపు, ఓరుపు, ఓర్పు, ఓరిమి | నెమ్మది |
| ఓమటి | దోమటి | అన్నము |
| ఓరపాక | దోరపాక, మోరసాక | చోపిడి |
| ఓరుపరి | ఓర్పరి | సహింపుకలవాఁడు |
| ఓవర | ఓవరి | వాసగృహము |
| ఓసరింత | ఓసరింపు | తొలఁగుట |
| ఓహరి | ఓహరిసాహరి | తండోపతండముగ |
| ఔజు | అవుజు, అవుదు, ఔదు, ఔదరి | కాలువ |
| ఔర | అవురు, అగురు | వీరణము |
| ఔసు | అవుసు, హౌసు, హావుసు | సొగసు |
| | క | |
| కంకటి | కంగటి | పానుపు |
| కంకర | కరసు, కఱకు, కఱుకు | దురుసు |
| కంకరగాడిద | కంచరగాడిద | వేసడము |
| కంగిస | కం[illegible]సు, కయ్యము | యుద్ధము |
| కంజో | క[illegible]ఁజో, కయిజో, కవుఁజో, కయిదు, కైజో, కైదు, కౌఁజో | కపింజలపక్షి |
| కంటు | కట్టరము, కట్టారము | నాట్యబంధము |
| | కనుట | చూచుట |
| కంటలము | కంటాళము, కంట్లము | మాదిమాట |
| కంటసము | కంటకము | కచ్చెమాట |
| కంటాణి | కంటాళము | పెద్ద నూది |
| కండువ | కండువా | ఉత్తరీయము |
| కందరిక | కందళము, కందళికము | ఎద్దువీఁదిగంత |
| కందురీఁగ | కందురు, కడుఁదురు, కణుఁదురీఁగ, కణుఁదురు, కనుదురు | గంధోలి |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
| --- | --- | --- |
| కందువ | కందువము | వింత, నేర్పు |
| కందెఱ | కనురెప్ప, రెప్ప, ఱెప్ప | పక్షము |
| కకవికలు | కకావికలు,వకవకలు,వికావికలు,పికపికలు | చెల్లాచెదరు |
| కర్కరితి | కర్కర్తి,కర్కటితి,కర్కర్త్రి,కర్కారితి,కర్కార్తి,కర్కాటితి, కర్కార్త్రి | బద్ధకము |
| కగ్గ | కగ్గము | ఖడ్గము |
| కచిక | కచ్చిక | కాలినపిడకతునక |
| కజ్జూరము | కజ్జురము,కజ్జూరము,గజ్జురము | ఖర్జూరము |
| కట | కటకట,కటకటా,కటా,కట్ట,కట్టా | అయ్యో |
| కటారి | కటారు,కఠారి | బాకు |
| కటిక | కటివాఁడు,కటికవాఁడు,కట్టిక | వేత్రహస్తుఁడు |
| కటికి | కట్టడి,గడుసరి,గొంటరి | కఠినుఁడు |
| కట్ల | కట్లె,కట్లే,కట్ల,కట్లమంచము | మంచపుఁజోటి |
| కట్లపురుగు | కట్టెడ | ఒకతెగపాము |
| కడఁక | కడంక,కణఁక,కదలిక,కదలు | యత్నము |
| కడకన్ను | కడగన్ను క్రేగన్ను | కటాక్షము |
| కడను | కడప,కడమ,కడెమి,కడ్మ | [illegible] |
| కడఁజు | కడంజు,కణఁజు,కణుజు,కడితి,క[illegible] | [illegible] |
| కడతేఱు | కడగొట్టు,కడపను,కడచు | [illegible] |
| కడప | గడప | [illegible] |
| కడపల | కడ | తుద |
| కడమపడు | కీడుపడు,కీడ్పడు | తక్కువపడు |
| కడముంత | కడుముంత | చిన్న[illegible]పాత్ర |
| కడలు | కరండము,కరడు,కెరడు,కరడము | [illegible] |
| కడిఁది | కడిమి,కడ్మి,కడుదు | శౌర్యము |
| కడిల | కడిలము,కట్ల,కట్లియ | కట్లతీఁగ |
| కడుగు | కగ్గు,కడువు,కణఁగు | ప్రక్షాళించు |
| కడుపు | కడ్పు,కరువు | [illegible] |
| కడువ | కడవ | కుండ |
| కణసెరము | కనిసెరము,కడసరము,కడుసూ.కణా[illegible],కరసూ | డేగ |
| కణఁతి | కణఁతి,కడఁతి,కంలి | శిరోవ్యాధి |
| కణుపు | కనుపు,కన్ను,కొడుపు,గనుపు | వెదురుగనుపు |
| కత్తలాన | కత్తలాని,కత్తళఁడు | ఒకతెగగుఱ్ఱము |
| కత్తవ | కత్తువ | గనిప |
| కత్తి | కత్తియ,కత్తె | ఖడ్గము |
| కత్తియము | కత్తెము | అంకెలబంతి |

| (శబ్దము) | (రూపాంతరము) | (టీక) |
|---|---|---|
| కదంబకము | కదంబము | మిశ్రమము |
| కదలడము | కదలిక, కదలిపోక, కదలుడు | ప్రయాణము |
| కదలాడు | కదలు, కదులు, కసరు | చలించు |
| కదా | కద, కదె, కదే, కా, కాదా, కాదె, కాదే | కిలార్థకము |
| కనకన్ | కనుకన్, కానన్, కావునన్, కాఁగన్ | కాఁబట్టి |
| కనరు | కనలు, కనుపు, కలుచే | కోపము |
| కనలు | కనారలు, కాగు | కోపగించు |
| కనిపించు | కానిపించు, కాన్పించు, కానఁబట్టు | ప్రత్యక్షమగు |
| కనుకలి | కన్ను, కానుపు, కాన్పు, కనుఁబాటు, | దృష్టి |
| కనుగిలుపు | కనుగిల్పు, కనుగేలు, కన్గిలి, కన్గిలుపు, కన్గిల్పు కన్గీటు | కనుసైగచేయు |
| కనుపట్టు | కన్పట్టు | గోచరించు |
| కనుపాప | కనుపాప, పాప | కంటిలోనిబొమ్మ |
| కనుబొమ | బొమ, బొమ్మ కనుబొమ్మ | భ్రూవు |
| కనుమరి | కమ్మరీఁడు, కమ్మరవాఁడు, కమ్మరి, కమ్మరీఁడు, కరుమల, కరుమలి | ఇనుపపనివాఁడు |
| కనుమొఱఁగు | కన్నుమొఱఁగు, కన్మొఱఁగు, కనుమూయు, కనుఁబ్రామి | వంచనచేయు |
| కనువినికి | కంటివిన్కరి | పాము |
| కన్నగాఁడు | కన్నడీఁడు | గండిదొంగ |
| కన్నఁడు | కన్నయ్య | కృష్ణుఁడు |
| కన్నియవేడి | కన్నెవేడి, కన్నెవేడు, కన్నెవేఁడిపిట్ట | కాగండవపక్షి |
| కన్నీరు | కన్నునీరు, నీరు | అస్రువు |
| కబ్బపుఁగూరుపరి | కబ్బపుఁగార్వరి, కబ్బపునేతరి | గ్రంథకర్త |
| కమటము | కమ్మటము, కుమురు | కుంపటి |
| కమసాలవాఁడు | కమసాలెవాఁడు, కంసాలవాఁడు, కంసాలి, అగసాలి, అగసాలె | స్వర్ణకారుఁడు |
| కమ్మచ్చు | కమ్మెచ్చు | లోహపుఁదీఁగలలాగునది |
| కమ్మటము | కమ్మరము | ఇనుపపని |
| కమ్మరేఁగు | కమరేను, కమ్మరేను | నక్కెఱు |
| కయి | కయిూసరుఁడు, కై, కైసరుఁడు | పద్యాలల్లువాఁడు |
| కయిత | కయితము, కైతము, కైత | కవిత్వము |
| కయివడి | కయివళిక్, కవుడవు, కైవడి, కైవళి | పోలిక |
| కర | కరా, కఱుకు | చుఱుకు |
| | కరడు, కరడము, కరండము, కడలు | తరంగము |
| | కొరక, కొరన, కొఱఁడు, కొఱను | కంచె |

